ఇది

"రాజవిశ్వాసము" గ్రంథకర్తయగు

# డామర్ల - క. వే. నరసయ్య

రచించినది

పూర్వపు చెన్నపురి హైకోర్టు ఆక్టింగ్ చీఫ్‌జడ్జియు

సర్వకలాశాల వైస్ ఛాన్ సెలరునగు

దివాన్. బహదూర్

## డాక్టర్ సర్ యస్. సుబ్రహ్మణ్యయ్యర్ గారు, సి. ఐ. ఇ.

అనుగ్రహించిన ఉపోద్ఘాతము బొందినది

---

రెండవకూర్పు - పరిశోధింపఁబడినది

---

1915 సం॥ జూన్ నెల 12 తేది జీ. ఓ. 1314 మేరకు

గ్రామవాసుల క్షేమమునకై జిల్లాలయం దుపయోగించుటకుగాను

చెన్నపురి గవర్న్మెంటువారి కనుకూలింపఁ బడినది

ఆంగ్లేయ రాజ్యముపైగల

భక్తి గౌరవాతిశయములను ప్రకటించుటకును

మహా విజయ శీలుండగు

ఐదవ జార్జి చక్రవర్తిగారి

పరాక్రమాతిశయమునకును

చెన్నరాజధానియందు పైవారి ప్రతినిధులగు

మహా ఘనత వహించిన

# లార్డ్ పెన్‌ట్‌లన్‌డ్ మహనీయునకు

వారి యనుమతిపై

ఆయన ప్రీతిపూర్వకముగను ఆదరణతోడను పాలించుచువచ్చెడి విశ్వాస-

మునకును అప్పుడప్పుడొనరించుచుండు మహోపకృతికిని వారి

ప్రజ లెల్లప్పుడును కృతజ్ఞత గలవారనుటను

నిరూపించుటకును నీ గ్రంథకర్తచే

ఈ చిన్న పుస్తకము

సమర్పితంబయ్యె

# పీఠిక

ఇప్పు డైరోపా ఖండమున జరుగుచుండు మహా యుద్ధమువంటి దిదివఱలో జరిగియున్నటుల మన మెఱుంగము. యుద్ధమునకనియే యనేక సంవత్సరములనుండి పలు తెఱఁగులగు యుద్ధోపకరణములు సిద్ధముచేయఁబడి యిప్పుడు రంగమునకువచ్చి మితిమీరిన కష్టనష్టములను గలిగించుచున్నవి. ఇదివఱలో యుద్ధములు నీటనో మెట్టనో లేక యీ రెంటనో జరుగుచుండినవి. ఇప్పటి యుద్ధమన్ననో కన్నుల కగపడకయే నీటను నేలను మాత్రమేగాక సొరంగములందును శూన్యమైన యాకాశమునను జరుగుచున్నది. లోకమునంగల సకలదేశ వీరులును మన యిండియా సిపాయీలును భేదములేక ఐరోపావీరులతో సమముగా నిలిచి పగతురతో జగడము లాడుచున్నారు. తుదకువీరు జయలక్ష్మీ సమేతులై మఱలుదురనియే మనము నిస్సంశయముగా నమ్ముచున్నారము.

మనలో నిజము నెఱుఁగనివారు గొందఱు మన యాంగ్లేయుల ప్రభుత్వమువలని లాభముల నెఱుంగక యీయుద్ధ మెట్లు ముగియునోయని సంశయించుచున్నారు: మఱికొందఱు టర్కీదేశము జెర్మనితోఁ గలసినందున నిండియాలోని తురకలు కూడి యల్లరిచేసి దేశక్షేమము చెడునని భయమందుచున్నారు: తూరుపు సముద్రమున "ఎమ్డెన్" అను జర్మనివారి యుద్ధనావను నాశముచేయుటయందు గలిగిన స్వల్పాలస్యమును దలంచియు, ఆ యోడచేసిన టక్కులను జూచియు, అది గలిగించిన నష్టములం గాంచియు, మనదొరతనము వారు జెర్మనివారిని జయింతురనుట సంశయమని మఱికొందఱు తలంచిరి. అవి పొరబాటే. ఈలాటి సందర్భమున మన దొరతనమువారు జెర్మనివారి నోడింపఁగలరనుటయు, ఇండియాలోని మహమ్మదీయులందఱును నాంగ్లేయులఁజేరిన ప్రజలేయనుటయుఁ జక్కఁగా విశదీకరించుట యావశ్యకమయ్యెను.

యుద్ధవిషయమును గూర్చి వ్రాయుట చరిత్రకారుల కార్యమేయైనను, నా మిత్రు లనేకుల వేడికోలునను, ఐరోపాసంఘమువా రిండియా గవర్నమెంటువారి కెత్తిచూపియుండు కొన్ని సూచనల ననుసరించియు, ఈ గొప్పవిషయమును స్వల్పమగు నా బుద్ధికిఁ దోఁచినమట్టు సంగ్రహముగాఁ బ్రచురింపఁ బూనితిని. ఇందు మన యాంగ్లేయు లిప్పటి యుద్ధమునఁ బ్రవేశించుట ధర్మమును వాగ్దానమును నెలకొల్పఁ బూనియే యనుటకును, ఇండియనుల రాజవిశ్వాసమును, ఆంగ్లేయులే జయింతురనియు శత్రువులు తప్పక పలాయితులగుదురనియు నమ్ముటకుఁ గల లక్షణములను, ఆంగ్లేయుల యేలుబడివలని

మేళ్లను, మఱికొన్ని విషయములను సంగ్రహముగాఁ జెప్పియున్నాఁడను. క్షోభము గలిగియుండు నీ తరుణమున ప్రజలమగు మనము దొరతనమువారిపట్ల నడచుకొనవలసిన రీతులు దెలియునట్లు "మనకు విధియైన కృత్యము" అను పేరితో నొక సద్బోధన అధ్యాయమును (26-వదానిం) జేర్చియున్నా-వాఁడ. యుద్ధమున జయాపజయములు సహజమేయనుట నెఱింగి జనులెల్లరును ధైర్యమును వదలక నిర్ణయముతో దొరతనమువారికి సహాయము చేయవల-యుట మిగుల నావశ్యకము. ఈచిన్నపుస్తకము నామోదించి మనస్ఫూర్తిగఁ దమ కర్పించిన దీనిని బరిగ్రహించిన మహాఘనత వహించిన చెన్నపురి గవర్నరగు పెన్‌ట్లన్‌డ్ ప్రభువుగారికిని, క్షేమపూర్వకముగ నుపోద్ఘాతము వ్రాసి యనుగ్రహించిన మునుపటి చెన్నపురి హైకోర్టు ఆక్టింగ్ చీఫ్‌జడ్జియు సర్వకలాశాల వైస్‌ఛాన్‌సెలరునగు మ-రా-రా-శ్రీ దివాన్‌బహదూర్ డాక్‌టర్ సర్ యన్. సుబ్రహ్మణ్యయ్యర్ గారికిని, ఈ చిన్న పుస్తకమును బ్రకటించుట యందు సహాయముగానుండిన నా మిత్రులకును కొఱవడని కృతజ్ఞత గలవాఁ-డనై యున్నాఁడను. ఈ చిన్న పుస్తకమునంగల విషయములన్నియు సన్మార్గ-మును బోధించునవియే యని యెఱింగి గ్రామవాసు లిద్దానిని జదివి క్షేమము నొందవలయునను తలంపుతో నందందు దీని నుపయోగించుటకై దయామయులగు మన గవర్న్మెంటువారు సంపూర్ణానుగ్రహముతో 1915 వ సంవ-త్సరం జూన్ నెల 12 తేదీని గలిగిన 1314-వ జీ. ఓ. ననుసరించి యీ పుస్త-కమును దమ కుపయోగించునట్లు నా కాజ్ఞాపించి పరిగ్రహించి గౌరవించి-నందులకుగాను ఎల్లప్పుడును నేను వారికి మిక్కిలి విశ్వాసమును గృతజ్ఞతను గలవాఁడనై యున్నవాఁడ. యుద్ధ విషయములు వార్తాపత్రికలయం దొకటి-కొకటి మారుపడి యుండుటవలన, దీనను గొన్ని విషయములు మారియుండు-నట్లు కొందఱు తెలిసికొననగును. అట్టివానిని తగుమైన ఆధారములఁగొని పరి-శోధించి రెండవదగు నీ కూర్పును ప్రచురించి యున్నాడను గాన, చదువరు లీ పుస్తకమున నింకను కొఱతలం గనిరేని విషయముయొక్క గౌరవము నెంచి సంతసింతురని యత్యంత వినయముతోఁ బ్రార్థించుచున్నాడను.

సూర్యవిలాసం
9, అవధానం రామస్వామయ్య వీధి,
ప్రాతచాకలపేట, మదరాసు: 16-6-1915 } దామర్ల-క. వే. నరసయ్య

పూర్వపు చెన్నపురి హైకోర్టు ఆక్టింగ్ ప్రథమ జడ్జియు
సర్వకలాశాల వైస్ ఛాన్సెలరునునగు
దివాన్ బహదూర్
డాక్టర్ సర్ యస్. సుబ్రహ్మణ్యయ్యర్ గారు, సి. ఐ. ఇ.
అనుగ్రహించిన

# ఉపోద్ఘాతము

"ఇప్పుడు జరుగుచుండు క్రూరమైన యుద్ధముయొక్క వివరణమును సాధారణ జనులకు విశదముగా నెత్తిచూపెడి యుత్కృష్టాభిప్రాయముతో దామర్ల క. వే. నరసయ్య వ్రాసియుండు నీ చిన్నపుస్తకము ఈ సమయమున మిక్కిలి యావశ్యకమైనదని చెప్పవలయుననుటకు నే మాత్రము సందేహము లేదు. ఇది యొక గొప్ప లోకోపకారమే.

అనేక విధములచేత ఆయన యెత్తిచూపియుండు విధము ప్రస్తుతము దొరతనమువారికి విరోధముగాఁ గొందఱు బుద్ధిహీనతయొక్క ఫలముగాఁ జెప్పెడి నిష్ప్రయోజనములగు కథలవలన దేశమునకు ననేకవిధములగు చెడుగులు గలుగకుండుటకై వలసిన యుపాయము నొకొక్కరును వెదుకవలసినది గొప్ప విధియే. అట్టి విధిని నెరవేర్చుటకు నిట్టి పుస్తకము మిక్కిలి యుపయోగమైన సాధనము.

దొరతనమువారికిని ప్రజలకును మేలు గలిగింపఁగల యీ పుస్తకమును విద్యార్థులులోనుగా సాధారణ జనులందఱును శ్రద్ధతోఁ జదివి యథార్థము నెఱింగి జనులకును జననాథునకును క్షేమమును గలిగించునటులు ఆబాలవృద్ధముగా నందఱును బ్రయత్నింపవలయుననుట నా యాశయము. 'ధర్మమేవాభిరక్షతు' అను నీతివాక్యము తత్సమయమున నెట్లైనను దప్పదు.

పరమేశుని కరుణచే మన దొరతనమువారును, వారి మిత్రులగు రాజులును తప్పక నీపెద్దయుద్ధమున జయింపవలెనని యనుదినమును అందఱమును సర్వేశ్వరుని బ్రార్థింతముగాక!"

# OPINIONS

THE PRIVATE SECRETARY TO

HIS EXCELLENCY THE RIGHT HONOURABLE

BARON HARDINGE OF PENHURST,

G.C.B., G.M.S.I., G.C.M.B., G.M.I.E., G.C.V.O., I.S.O.,

*Viceroy and Governor General of India.*

I am desired to convey to you His Excellency the Viceroy's thanks for your pamphlet entitled **"The War and the British Raj"**...His Excellency much appreciates your desire to place before the public a clear account of events connected with the present War and the part India is playing in it.

THE PRIVATE SECRETARY TO

HIS EXCELLENCY THE RIGHT HONOURABLE

JOHN SINCLAIR BARON PENTLAND

OF LYTH, P.C., G.C.I.E., *Governor of Madras.*

I am to say that the book " **The War and the British Raj**" appears to His Excellency to be likely to serve a very useful purpose at the present time.

THE PRIVATE SECRETARY TO

HIS EXCELLENCY THE HONOURABLE

THOMAS DAVID BARON CARMICHAEL

OF SKIRLING, G.C.I.E., K.C.M.G., *Governor of Bengal.*

I am directed by His Excellency to thank you for your book entitled " **The War and the British Raj**". His Excellency feels sure that the knowledge which the little book will spread of the facts concerning the war and the part India is taking in it will all be for the good of India.

THE HON'BLE SIR S. P. SINHA, *Barrister-at-law,*
*Formerly Executive Council Member to*
*H. E. The Viceroy, Calcutta.*

I have read it ("**The War and the British Raj**") with pleasure and it seems to me that you give a very good account of the War itself and the part India is taking in it.

THE HON'BLE
SIR C. SANKARAN NAIR, B.A., B.L., C.I.E., F.M.U.,
*Executive Council Member to H. E. The Viceroy, Delhi.*

I have read your pamphlet "**The War and the British Raj**". I think it will be very useful to the Students and generally to those Indians who take any interest in the subject.

THE HON'BLE SIR P. S. SIVASWAMI AIYAR Avl.,
B.A., B.L., C.S.I., C.I.E., F.M.U.,
*Executive Council Member to H. E. The Governor of Madras.*

I think that it ("**The War and the British Raj**") is a very timely and useful publication. It is quite fit to be placed in the hands of the Masses and Students.

SIR NARAYAN G. CHANDAVARKAR, B.A., LL.B.,
*Retired Judge, High Court, Bombay.*

I have read with interest your account of "**The War and the British Raj**"...and have much pleasure in saying that you have made it readable by men, telling the facts clearly and with conciseness and pointing out the reasons which have led England to enter on the War in defence of liberty and smaller nationalities. It is a very good account and ought to be useful to the Masses.

DEWAN BAHADUR K. KRISHNASWAMI RAO GARU,
C.I.E., *Retired Dewan of Travancore.*

I have read with very great pleasure Mr. T. K. V. Narasiah's...pamphlet on "**The War and the British Raj**". It is written in easy and classical style, contains much useful information and is best calculated to remove misconceptions regarding the War and the might of the Nations at War. The chapter on "**Duty**" is excellent and deserves careful study. I wish success to Mr. Narasiah in his patriotic and loyal service to the Empire.

THE HON'BLE DEWAN BAHADUR
JUSTICE T. SADASIVA AIYAR AVL., B.A., M.L.,
*Judge, High Court, Madras.*

Mr. T. K. V. Narasiah's book entitled "**The War and the British Raj**" seems to me to be issued at a very opportune moment. I went carefully through the 26th chapter, which is headed "**Our Duty**", and its sentiments and precepts are fully in accordance with the Hindu Shastras. Translations......into vernaculars and the distribution of the copies as vernacular tracts ought to be of very great usefulness both to Government and to the Masses.

THE HON'BLE
MR. JUSTICE T. V. SESHAGIRI AIYAR, B.A., B.L., F.M.U,
*Judge, High Court, Madras.*

I have looked through your pamphlet "**The War and the British Raj.**" It gives an accurate account of the Great War that is going on. I read with much interest the translation... Such a publication containing all the latest and available information on the subject must be welcome...

THE HON'BLE DEWAN BAHADUR
JUSTICE C.V. KUMARASWAMI SASTRIAR AVL.,
B.A., B.L., *Judge, High Court, Madras.*

Mr. T. K. V. Narasiah's book "**The War and the British Raj**" contains a lot of useful information about the earlier stages of the War and the Indian Chiefs who have gallantly placed their resources at the disposal of the Empire. Thoroughly loyal in spirit, I am sure it will be appreciated by the public. The chapters on "**England's Work in India**" and "**Our Duty**" deserve to be widely read. The book might be read with profit and pleasure by the Student population.

THE HON'BLE MR. JUSTICE J. H. BAKEWELL, LL.B.,
*Barrister-at-law, Judge, High Court, Madras.*

I think that your book on "**The War and the British Raj**" will be of great use. The great task before us and the manner in which India and the whole Empire have shown their determination to achieve victory for the King Emperor are well and clearly described. The book should do much to enlighten the ordinary citizen as to the vastness of the struggle and the need that each of us should do what he can for our country.

A. T. FORBES ESQ., I.C.S.,
*British Resident in Travancore and Cochin.*

With reference to the book on "**The War and the British Raj**" I write to say that in my opinion its intention is excellent and it should serve a useful purpose by enabling the public for whom it is intended to understand clearly the events which have led up to the War.

DEWAN BAHADUR
S. RM. M. RAMASWAMI CHETTIAR AVL.,
*President of the Taluk Board and Chairman of The Municipal Council, Chidambaram.*

I have read with much pleasure and interest Mr. T. K. V. Narasiah's book, " **The War and the British Raj.**" It gives a short but accurate account of the Great European War that is going on. Mr. Narasiah has taken great pains to collect materials for this book and the informations given in it are well arranged. The chapter on " **Our Duty** " is simply excellent.........This publication is most opportune and very useful to the Masses as well as to the Teachers of the Elementary Schools.

DEWAN BAHADUR M. ADINARAYANA IYAH GARU,
*Retired Deputy Commissioner, Revenue Settlement, Madras.*

......I congratulate him (Mr. T. K. V. Narasiah) heartily on the idea which inspired him to write this present book. The subject of it is the present " **War and the British Raj** ". The time is opportune for the issue of such a book and he has done a patriotic service by conveying to the large mass of the public in their own vernaculars a lot of useful and correct information as to the benefits conferred by the British Government and the duties which the people of this country owe for the maintenance of British supre macy. I heartily welcome the book fo the good service which I am sure it will render and wish for it and the author the success they deserve.

THE HON'BLE
RAJA K. R. V. KRISHNA RAU BAHADUR GARU, B.A.,
*Zamindar of Polavaram, Cocanada.*

Mr. T. K. V. Narasiah's book "**The War and the British Raj**" is an opportune publication. The author has very lucidly explained from the very beginning the causes of the War and the ambition of Germany. I am of opinion that this little book explains in a lucid manner the entire history of the present European War, the causes which led to it, and the duty of India towards the British Empire. A publication of this kind at this juncture is indeed a very welcome one. I am indeed very glad that the author has brought out this publication and intends giving Tamil and Telugu versions for the advantage of Telugu and Tamil reading public. I hope that these books will be generally read by a large number of readers and will tend to dispel the misapprehension of the ignorant and ill-informed public including the Masses. I congratulate the author on his publication.

KHAN BAHADUR
MUHAMMAD KHADER NAVAZ KHAN SAHIB
BAHADUR,
*Retired Collector of Nellore.*

I have perused your book "**The War and the British Raj**" with great interest and congratulate you on the way you have dealt with the subject. It presents in short space all that one should like to know about the War and I certainly consider it is well fit to be placed in the hands of the Masses and the Students.

M. R. Ry.

C. V. VISVANATHA SASTRIAR Avl., B.A.,B.L.,

*Sub-Judge, Kumbakonam.*

" **The War and the British Raj**" is a nice little pamphlet which affords very interesting reading. The author has taken great pains to collect all the important materials relating to each country at War and has strung them up in the best way possible. I hope the book is read by every Student of the High School and College classes. This will dispel illusions from the minds of many of them as to the real cause of the War and the strength of the Allies.

J. C. ROLLO Esq., M.A.,

*Principal, Pachaiyappa's College, Madras.*

Mr. T. K. V. Narasiah's.........book on " **The War and the British Raj** " seems well adapted to its purpose. It gives, in compact form, a considerable amount of information well arranged. It will, I have no doubt, be of great use to the Masses, since its information is not readily accessible to them, and Teachers in schools also may find it a serviceable instrument.

Rev. E. MONTEITH MACPHAIL, M.A., B.D., F.M.U.,

*Professor of History, Madras Christian College.*

I have looked through your book on "**The War**" with special attention to the chapter on " **Our Duty.**" I think your general idea is good and that the chapter on " **Our Duty** contains some very excellent advice as to the ways in which loyal citizens may help in the present crisis.......

M. S. H. THOMPSON Esq., B.A., A.C.P.,
*Ag. Assistant Inspector of European and Training Schools, Madras.*

**"The War and the British Raj":**—The book is a practical lesson on Loyalty and will be found specially useful by Elementary School-masters who are anxious to do their duty at this time by giving a series of simple lessons on the War. The matter is well arranged, the topics following in natural sequence. The exposition is simple and direct.

PROFESSOR
K. RAMANUJA CHARIAR AVL., B.A., F.M.U.,
*Pachaiyappa's College, Madras.*

.........The......... books (**" The War and the British Raj"**)are written in simple style and bring out the prominent facts in a clear light. The European Situation, the Motives of the Allies, the Moral Weakness of the Germans, and the Ungrateful Treachery of the Turks—these have been specially laid stress upon. Belgian Bravery, Russian Heroism, French Stratagem, Indian Gallantry and English Superiority, the Co-operation of our Rajas in men, money and personal service, and lastly, the Safety of Indian Trade—these are also succinctly described. The books are bound to prove an eminent success and it behoves all managements of Institutions and all householders to encourage the reading of such books by the boys and the women in their charge, so that every one of our vast nation may be patriotic and loyal not only by instinct as they are, but also after a rational understanding of the situation. ......We commend this book to the public and hope it will command wide patronage.

# వి ష య సూ చి క

అధ్యాయము విషయము పుట.

1 British Supremacy : ఆంగ్లేయుల ఆధిపత్యము ... 17

2 German Calculation : జెర్మనివారి తలంపు ... 20

3 Crown Prince of Austria : ఆస్ట్రియాదేశపు యువరాజు 24

4 Causes of the War : యుద్ధ కారణములు ... 26

5 Emperor George V : జార్జి చక్రవర్తి ... 29

6 Belgian Neutrality : బెల్జియముయొక్క మధ్యస్థము ... 32

7 The Allies and the Compact :
మిత్రులును ఏర్పాటును

i The French : ఫ్రెంచివారు ... ... 36

ii The Russians : రుష్యావారు ... ... 37

iii The Compact : ఏర్పాటు ... ... 38

8 Combined Strength and Resources :
సంయుక్త బలమును ఆధారములును ... ... 39

9 The War : యుద్ధము ... ... ... 42

10 Turkish Treachery : టర్కీ ద్రోహము ... ... 46

11 Egyptian Imprudence : ఈజిప్టు అవివేకము ... 50

12 German Atrocities : జెర్మనివారి క్రౌర్యములు ... 51

13 Belgian Bravery : బెల్జియనుల ధైర్యము ... 53

14 Russian Heroism : రుష్యనుల పరాక్రమము ... 56

15 French Stratagem : ఫ్రెంచివారి తంత్రము ... 58

| అధ్యాయము | విషయము | పుట. |
|---|---|---|
| 16 | English Superiority : ఆంగ్లేయుల శ్రేష్ఠత ... | 61 |
| 17 | Indian Gallantry : ఇండియనుల శూరత్వము ... | 64 |
| 18 | Indian Princes for Active Service: యుద్ధరంగమున కేగిన ఇండియా రాజులు ... | 67 |
| i | H. H. The Maharaja of Patiala : పాటియాలా మహారాజు ... ... ... | 68 |
| ii | H. H. The Maharaja of Bikanir : బికానీర్ మహారాజు ... ... ... | 69 |
| iii | H. H. The Maharaja of Idar : ఐడార్ మహారాజు ... ... ... | 69 |
| iv | H. H. The Maharaja of Jodhpur : జోడ్‌పూర్ మహారాజు ... ... ... | 70 |
| v | H. H. The Nawab of Jaora : జోరా నబాబు... | 71 |
| vi | H. H. The Maharaja of Rutlam : రట్లం మహారాజు ... ... ... | 71 |
| vii | H. H. The Prince of Bhopal : భోపాల్ రాజకుమారుఁడు ... ... | 71 |
| viii | H. H. The Maharaja of Kishengarh : కిషన్‌గార్ మహారాజు ... ... ... | 72 |
| ix | H. H. The Nawab of Sachin : సచ్చిన్ నబాబు | 72 |
| x | H. H. The Maharaja of Cooch Behar : కుచ్ బేహార్ మహారాజు ... ... | 73 |
| xi | H. H. The Maharaja of Panna : పన్నా మహారాజు ... ... ... | 74 |
| xii | H. H. The Nizam Hyderabad : హైదరాబాదు నైజాము ... ... ... | 74 |
| 19 | The Queen and the Prince of Wales : మహారాణియు యువరాజును ... ... | 76 |

| అధ్యాయము | విషయము | పుట. |
|---|---|---|
| 20 | Indian Loyalty : ఇండియావారి రాజవిశ్వాసము ... | 77 |
| 21 | H. E. Lord Hardinge : హార్డింజ్ ప్రభువు ... | 80 |
| 22 | The Three Governors : మూవురు గవర్నరులు | |
| | i H. E. Lord Pentland : పెన్‌ట్‌లెన్‌డ్ ప్రభువు | 82 |
| | ii H. E. Lord Carmichael : కార్మికేల్ ప్రభువు | 83 |
| | iii H. E. Lord Willingdon : విల్లింగ్‌డన్ ప్రభువు | 83 |
| 23 | The Emden's Pranks : ఎమ్డనుయొక్క చేష్టలు ... | 84 |
| 24 | India's Safety : ఇండియాయొక్క భద్రము ... | 90 |
| 25 | England's Work in India: ఇండియాలో ఆంగ్లేయుల కృత్యములు ... ... | 92 |
| 26 | Our Duty : మనకు విధియైన కృత్యము ... ... | 96 |
| 27 | Probable Advantages to India by this War : ఈ యుద్ధమువలన ఇండియాకు కలుగు లాభములు ... | 104 |
| 28 | Present Situation : తత్కాల స్థితి ... ... | 107 |

## యుద్ధమునఁ బ్రవేశించియుండు దేశస్థుల సేనా వివరణము

| దేశము | | మెట్టసేన | యుద్ధనావలు | ఓడసేన | రిసర్వ్ ఓడవీరులు | ఆకాశయుద్ధ యంత్రములు |
|---|---|---|---|---|---|---|
| **స్వపక్షము** | | | | | | |
| గ్రేట్ బ్రిటన్ * (మాత్రము) | ... | 18,80,000 | 599 | 1,51,000 | 60,900 | 409 |
| ఫ్రాన్స్ | ... | 40,00,000 | 335 | 69,500 | 70,000 | 1,422 |
| ఋషియా | ... | 70,00,000 | 159 | 59,500 | 50,000 | 818 |
| బెల్జియం | ... | 3,00,000 | ... | ... | ... | 102 |
| సెర్వియా | ... | 3,50,000 | ... | ... | ... | 60 |
| మాంటెనీగ్రో | ... | 40,000 | ... | ... | ... | ... |
| ఇటలి | ... | 20,00,000 | 161 | 40,000 | 40,000 | 159 |
| జపాన్ | ... | 20,00,000 | 189 | 51,000 | 50,000 | 180 |
| **పరపక్షము** | | | | | | |
| జెర్మని | ... | 60,00,000 | 263 | 79,000 | 70,000 | 524 |
| ఆస్ట్రియా | ... | 25,00,000 | 46 | 23,000 | 20,000 | 108 |
| టర్కీ | ... | 10,00,000 | 49 | 39,000 | ... | ... |

* ఆంగ్లేయులకు లోఁబడియుండు నితరదేశములందును ఇండియాయందును గల సైన్యబలము ఇందు చేర్పఁబడియుండలేదు : అది ప్రత్యేకము.

శ్రీరస్తు

# THE WAR AND THE BRITISH RAJ

# యుద్ధము ఆంగ్లేయరాజ్యము

## BRITISH SUPREMACY

## ఆంగ్లేయుల ఆధిపత్యము



అనాధరక్షకుఁడును ఆపద్బాంధవుఁడును అగు జగదీశ్వరుని కరుణచేత అనేక కోటి జీవరాసులను ప్రీతితో రక్షించి ఆనందము కలుగునట్లు పరిపాలించెడి ఆంగ్లేయరాజ్యము ఐరోపాఖండమునకు వాయవ్యభాగమున నున్నది. దీనికి బ్రిటిష్‌దీవులు అనియు, యునైటెడ్‌కింగ్‌డమ్ అనియు, గ్రేట్‌బ్రిటన్ అనియు పేళ్లు వెలయుచున్నవి. ఇది ఇంగ్లాండు వేల్సు స్కాట్లాండు ఐర్లాండు అనెడి దేశములు చేరి ఒక లక్ష ఇరువదియొక్క వేల (121,000) చదరపుమైళ్ల విస్తీర్ణము గలది. ఇందు దాదాపు నాలుగు కోట్ల ఏఁబదియైదు లక్షల (45,500,000) జనులు వసించుచున్నారు. ఈ రాజ్యమునకు లండన్ ముఖ్యపట్టణము. దీని పాలకుని పేరు ఐదవ జార్జి. మన హిందూదేశము ఆంగ్లేయప్రభుత్వమునకు లోఁబడియుండుటచే ఈయాంగ్లేయప్రభువునకు చక్రవర్తియను బిరుదును గలదు.

ఈ యాంగ్లేయ రాజ్యము విక్టోరియా మహారాణిగారి కాలము మొదలు మిక్కిలి ఖ్యాతివహించి వర్తకమునందును ఐశ్వర్యమునందును నాగరికమునం-

దును ప్రపంచమునఁ గల సకల రాజ్యములలోను ప్రథమముగ నెన్నఁదగిన-దియై యున్నది.

ఈ రాజ్యమునకు ఆసియా, ఐరోపా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, అమె-రికా అను ఐదు ఖండములలోను పరిపాలనాధికారము గలదు. ఒక ఖండమున అస్తమించిన సూర్యుఁడు తత్క్షణమే మఱియొక ఖండమున నస్తమింపక యే భాగమునందేనియు ప్రకాశించుచుండుటచే నీ యాంగ్లేయ రాజ్యమున సూర్యుఁ డెప్పుడును ప్రకాశించుచుండునే గాని అస్తమించుట లేదు. ఈ ప్రభుత్వమువారి పాలనయు సూర్య ప్రకాశమువలెనే ఖ్యాతినొందియున్నది.

ఇది ఐరోపాలో నొకచిన్నరాజ్యముగ నుండినను జలస్థల బలైశ్వర్య-ములు గల అనేక గొప్పరాష్ట్రములకు అధిపత్యమునొంది వానిని తల్లివలెఁ గాచుచున్నది. దీని ప్రభుత్వమునకు లోఁబడి నలువదికోట్ల జనసంఖ్య గలిగి ఒకకోటి పదిలక్షల (11,000,000) చదరపుమైళ్ల విస్తీర్ణము గల విదేశపు రాజ్యములు పరిపాలింపఁబడుచున్నవి. ఈ ప్రపంచపు జన సంఖ్యలో నాల్గవ భాగము ఈదేశపు రాజాజ్ఞకు స్వాధీనమైయున్నది.

ఈ రాష్ట్రమునకు సంబంధించిన విదేశరాజ్యములలో ఆయాదేశపు భద్రమునకై యేర్పడియుండు సేనలు తప్ప ప్రధానరాజ్యమగు ఇంగ్లాండుదేశ మునందు సయితము విశేషముగ నావికాసైన్యమును గుఱ్ఱపుదళమును కాల్బ లమును గలవు. దేశమంతయు నెమ్మదిగానుండు కాలమున సహజముగా రాజాంగరక్షణకై యింగ్లాండులో 234,000 యుద్ధవీరులను గాపాడుచుం-డుటగలదు. మొదట సేనలోఁ జేరి యుద్ధశాస్త్రమునంతయుఁ జక్కఁగ నేర్చిన వెనుక యితర వృత్తులలోఁజేరి సమయము వచ్చినప్పుడు మఱల సేనలోజేరెడి వారు 'రిజర్విస్టు' లనఁబడుదురు. ఇట్టివారు దేశరక్షణకై యొక్కొక్క రాజ్యమునను గలరు. ఇంగ్లండుతోఁజేరిన రిజర్విస్టులు 146,000గురు గలరు. అయినను, ఈప్రభుత్వమువారు రాజ్యతంత్రమున మిక్కిలి సమర్థులగుటచే తమసైన్యముల యమరికయును చర్యయు నెవరికిని వెల్లడికాకుండునట్లు ఏర్పా టులు చేసియున్నారు. వీరలకు స్వల్పకాలములోపల ఒకకోటిగ చేరఁగల అనేకలక్షల కాల్బలమును గుఱ్ఱపుదళమును గలవు.

ప్రస్తుతమున వీరియొద్ద సముద్రసేనలగు ననేక యుద్ధనావలు గలవు. తాత్కాలిక నవీనశిల్ప కల్పన లమరి యెట్టిదానినైనను నిరసించి పోఁగూడిన

డ్రెడ్ నాట్టులను గొప్ప యుద్ధనావలును, నీట మునిగియుండి పైన దేలుచు పోయెడి యుద్ధనావలను ధ్వంసము చేయ సమర్థములయిన గుండ్లను గలిగిన టార్పిడోలను నీటమునుగు నోడలను సైతము పవులగొట్టదగిన 'టార్పిడో బోట్ డిస్ట్రాయరు'లనునవియు, నీటిలో దాగి సముద్రోదకమున మునింగియు దేలియు నితర నావల నాశముసేయు 'సబ్ మెరీను'లను యంత్రపుం బడవలును, శత్రునావల వెదకి నాశముసేయను మిత్రులయోడల ననుసరించి రక్షింపను నందందు దిరుగుచుండు 'క్రూజరు'లను చిన్న యుద్ధనావలును, ఇంకను బ్రాత యోగ్యావట్లుగల యుద్ధనావలును జేరి 599 యుద్ధనావ లీ యుద్ధారంభమున నుండెను. అప్పుడప్పుడు నావలకు గలుగు లోపములను చక్కంజేయుటకై పెద్ద నావికాలయములును గలవు.

వీనికన్నిటికిని సంబంధించిన ఉద్యోగస్థులును సేవకులును జేరి ఒక లక్షయు యేఁబదియొక్క వేల (151,000) మంది నియమింపఁబడియున్నారు. సమయము తటస్థించినప్పుడు యుద్ధమున జేయుటకు 'రిజర్వ్' నావికావీరులును 60,900 గురు గలరు. వీరలందఱికిని దినమొక్కటికి నాలుగులక్షల ముప్పది యైదు వేల రూపాయలు (4,35,000) సంబళము లియ్యఁబడుచున్నవి. ఈ నావల క్రయముయించుమించుగా వేయియు నేఁబదికోట్లు (10,50,00,00,000) రూపాయ లగుచున్నవి. ఈ నావలలో వేలకొలది పిరంగులు గలవు. వానిలో ముఖ్యముగా ఒక్కసారి కాల్చుటకు నాలుగువేల అయిదువందల (4,500) రూపాయల విలువగల పెద్దగుండ్లను బ్రయోగింపఁదగిన పిరంగులు మున్నూట డెబ్బదిరెండు (372) సిద్ధము చేయఁబడి యున్నవి. ఇవి చాలక తాత్కాలిక శిల్పకలాకౌశలములు గల 'డెరిజబిలు'లను నాకాశయానములును, ఏరోప్లేనులును చేరి నన్నూట తొమ్మిది (409) గలవు. ఇంత సొంత సైన్య బలము గల మన యాంగ్లేయులు ప్రకృతమున ఐరోపాయందు జఱిగెడి యుద్ధములో చిన్నరాజ్యపువారగు బెల్జియనులతో తాము 1830 సం॥ లోను మరల 1870 సం॥ లోను చేసికొనియుండిన ఒడంబడిక ప్రకారము శత్రువుల అక్రమపు యుద్ధమున బెల్జియనులకు సహాయముగా నిలిచి "ఆంగ్లేయులు మాట తప్పువారుకారు" అనెడి కీర్తిని స్థిరపఱచుకొనుటకై ముందుకువచ్చి నిలిచి యున్నారు.

సత్యమునకును ధర్మమునకును పాటుపడెడి మనయాంగ్లేయ దొరతన-

పువారు జయముపొందుటయు అక్రమయుద్ధమునకు పాలుపడిన శత్రువులు నాశమునొందుటయును తప్పదు. ఈశ్వరుఁడు రక్షించుగాత !

---

## 2. GERMAN CALCULATION

## జెర్మనివారి తలంపు

జెర్మని యనునది ఐరోపాలోని ముఖ్య రాజ్యములలో నొకటి. ఇది రెండులక్షల తొమ్మిదివేల (2,09,000) చదరపుమైళ్లు విస్తీర్ణము గలది: అనఁగా బర్మాదేశముకంటెను చిన్నది. ఇందు పూర్వము స్వేచ్ఛగా పరిపాలింపఁబడుచు వచ్చిన ఇరువదియాఱు (26) రాష్ట్రములును ఇప్పుడు దీనితో చేరియున్నవి. దీని పాలకుని పేరు కెయ్‌జర్. ఈయనకు చక్రవర్తి యను బిరుదును గలదు. ఇప్పు డీ రాజ్యమునకు విల్లియం అను నాతఁడు చక్రవర్తి. ఈయన 1850 సం॥ జనవరి 27-వ తేది జన్మించెను: 1888 సం॥ జూన్ 15-వ తేది రాజ్యాధిపత్యము వహించెను. ఈయన విక్టోరియా మహారాణికి దౌహిత్రుఁడు: ఋష్యా చక్రవర్తిగారి భార్యకు పెద్దతల్లి కుమారుడు. ఈయనకు ఆఱుగురు కుమారులును ఒక కొమార్తెయు గలరు. ఈరాజ్యము వేదాంత శాస్త్రవేత్తల చేతను వాణిజ్యముచేతను వాసికెక్కినది. దీనికి బెర్లిన్ ప్రధాన పట్టణము.

ఈరాజ్యమునకు విదేశములయందాధిపత్యమెందులేదు. ఆఫ్రికాలో తూర్పునను నైరృతి దిక్కునను పశ్చిమమునను అందందు చిన్నచిన్న రాజ్యములు గలవు. వానియన్నిటి విస్తీర్ణమునుచేరి ఎనిమిదిలక్షల తొంబది యెనిమిది వేల (898,000) చదరపుమైళ్లు. పెసిఫిక్ మహాసముద్రమందు న్యూగిని యనెడి ద్వీపమున కొంత భాగమును బిస్మార్కు ద్వీపములును వీరికి సొంతము.

ఈ దేశపువారు విస్తారముగ వ్యాపారముచేసి తమదేశపు నాగరికతను వృద్ధిచేసికొనిరి. వీరలు గడచిన 1913 సం॥ ఏడుపందల నలువదిరెండు కోట్ల యేఁబది లక్షల (7,42,50,00,000) రూపాయల విలువగల తమదేశపు సరకు-

లను పంపి ఎనిమిదివందల ఒక్కకోటి (8,01,00,00,000) రూపాయల క్రయ-ముగను విదేశపు సామానులను రప్పించుకొనిరి.

ఇంత విస్తారముగ వ్యాపారము చేయునట్టి వీరలకు సుకరముగ చాలినన్ని రేవుపట్టణములు లేనందున అట్టి వానిని తమకు సమీపమున నుండు స్వల్ప రాజ్యములవారియొద్దనుండి సాధింపవలయు ననెడి కోరిక గలవారైరి. గాని, ఆ స్వల్ప రాష్ట్రపు వా రన్ననో, ఉలాందా స్విడన్‌లాండు బెల్జియము దేశసులు తమ దేశములను కాపాడుకొనుటకై 1814,1815,1830-వ సం॥ లో ఈ జెర్మనివారితోడను ఫ్రెంచివారితోడను ఆంగ్లేయులతోడను చేరి లండను పట్టణమున నొక సంధిచేసికొని నిర్భయముగా నుండిరి. ఇందుచే జెర్మనివారి కోరిక సఫలము కాకపోయెను. కాఁబట్టి వేరువిధమైన తంత్రములు చేయవలసి వచ్చెను.

ఈ రాష్ట్రపువారు మిక్కిలి తంత్రముగా 1898 సం॥ చీనా దేశముతోఁ జేరిన కేయచౌ అనెడి గొప్ప ద్వీపమును చీనా చక్రవర్తియొద్ద గుత్తకు తీసి-కొని అందు ఇనుపదారుల నేర్పఱచియు గనులను త్రవ్వియు వర్తకము చేయునట్లును, ఆ వర్తకులకు ఎట్టి యపాయముగాని సంభవింప కుండునట్లు చీనా చక్రవర్తి రక్షింపవలయు ననియు, ఇంకను కొన్ని నిబంధనలు చేసి-కొని ఆనాడుమొదలు వీరలు ఆ దీవిని స్వాధీన పఱచికొని వర్తకము చేయుచువచ్చి, తుదకు తంత్రముగా దాని నాక్రమించుకొని అందు కొన్ని కోటలను కట్టి కొంత సైన్యమును కొన్ని యుద్ధ నావలను నుంచిరి.

వీరలు 1870—71 సం॥ లో ఫ్రెంచివారితో యుద్ధము చేసి అల్-సెస్ లోరేన్ అనెడి భాగముల వశపఱచికొనిరి. ఆ యుద్ధమున ఇరుదెగలవారికిని ఎనిమిది లక్షల ఏబది మూడువేల (853,000) జనులు నశించుట-యే గాక, ఆఱువందల అరువదియాఱు కోట్ల (6,66,00,00,000) రూపాయల రొక్కము వ్యయమాయెను. ఇందుచేత ఈ యుభయదేశములవారికిని అధిక వైరము కలిగి యది మొదలు మఱియొకతూరి యుద్ధము చేయవలయు నను కోరిక యుండుటవలన యుద్ధమునకు వలసిన యేర్పాటులు చేయుచువచ్చిరి.

ఇట్లుండ: ఈరాజ్యపు జనసంఖ్య సుమారు ఏడుకోట్లు (7,00,00,000). ఇప్పు డిది దినదిన ప్రవర్ధమానమై సంవత్సర మొక్కటికి పదిలక్షుల వంతున వృద్ధియగుచు వచ్చుచున్నది. ఈ రాజ్యమున పండెడి పంటల మూలముగా

ఇందలి జనులును సంవత్సరమున తొమ్మిది మాసములే జీవింపఁ గలిగియున్నారు. తక్కిన మూడు మాసముల జీవనమునకై యితర దేశపుఁ బంటల నెదురు చూడవలసి వారువారుచేయు వర్తకమువలని లాభముచేతనే జీవింపఁ వలసియున్నది. ఇట్లు ప్రతిసంవత్సరమును వృద్ధియయ్యెడి జనులకు తనరాజ్యమున వసించి జీవనము చేయుటకు చాలినంత పంటభూములు లేనందునను జెర్మని చక్రవర్తికి తన జనులకు భూవసతి కలుగజేసి కాపాడుటకై విదేశములయందు రాజ్యములను సంపాదింప నావశ్యకత యేర్పడెను. ఆంగ్లేయులకును ఫ్రెంచివారికిని డచ్చివారికిని ఇతర ఖండముల యందు అధికముగా వలస రాష్ట్రము లుండుటచేత వానిని తామెట్లైనను గ్రహింపవలయుననెడి యభిప్రాయముతో వారలతో యుద్ధము చేయఁగోరి రహస్యముగ నలువది సంవత్సరములనుండి యుద్ధమునకు వలయు సామగ్రులను గొప్ప సైన్యమును సేకరించుచువచ్చిరి.

ఈ దేశప్రజనులలో నొక్కొక్కఁడును యుక్తవయసు వచ్చినవెంటనే కొన్ని సంవత్సరములు సైన్యమునఁజేరి యుద్ధ విద్యయందు వాడుకపడి చక్రవర్తికి వలయునప్పుడు నిరాక్షేపముగా యుద్ధసన్నద్ధుడు కావలయు ననెడి యొక నిర్బంధమైన చట్టము గలదు. ఈ యాజ్ఞను ఉల్లంఘించువారలు కఠినశిక్షకుఁ బాత్రులగుదురు. ఇట్లు ఒక్కొక్కఁడును యుద్ధముచేయ వాడుకపడి యుండుటచే ఈ చక్రవర్తియొద్ద సాధారణ కలహముల నణచుటకు కావలసిన స్వల్ప సైన్యము తప్ప అధిక సైన్యము మాసవేతనమునకై యుండవలసిన ఆవశ్యకము లేక యున్నది. సాధారణ సమయము నీ రాజ్యమునందు 8,60,000 వీరులు గల సేన సిద్ధముగా నుండుట గలదు. ఆవశ్యకము కలిగినప్పుడు తన ప్రజలలో స్త్రీలును బాలురును వృద్ధులును తప్ప తక్కిన వారందఱును సైన్యముగాఁ గూడుదురు. ఇది యిట్లుండియు నీ జెర్మని చక్రవర్తి అధిక ద్రవ్యము వెచ్చించి సైన్యమును యుద్ధసామగ్రులను మితి మీఱ సేకరించుచువచ్చెను.

ఇవ్విధమున ఈ చక్రవర్తియొద్ద ప్రకృతమున గుఱ్ఱపుదళమును కాల్బలమునుచేరి అరువది లక్షల (60,00,000) సేనలును అనేకవేల పిరంగులును కలవు. టార్పిడో బోట్ డెస్ట్రాయరులు సబ్ మెరీనులు క్రూజరులులో నగునవి అన్నియుచేరి 263 నావలును, 69,000 పనివాండ్రతో యుద్ధారంభకాలము

సిద్ధముగా నుండెను. మఱియు 70,000 రిజర్వులును గాపాడ బడియుండిరి. ఆకాశమున బోవు విమానములును ఏరోప్లేన్ జప్లిన్ అనెడి నవీన యంత్ర-ములు 5,040 ను యుద్ధమునకు సిద్ధములై యుండినవి. ఇంకను నిట్టివాటిని వీరు విశేషముగ సిద్ధము చేయుచున్నారు.

వీరలు తాము ఆంగ్లేయులతో మొట్టమొదట యుద్ధము చేయబూనిన యెడల అపజయము పొందుట తప్పదని భయపడి వారితో స్నేహముగ నుండు నట్లు నటించుచు, ప్రథమమున ఫ్రెంచివారి విషయమై తమకు చాలా కాల-ముగ నుండెడి పగ తీర్చుకొనుటకయి వారితో యుద్ధము చేసి వారి వలన రాష్ట్రములను తా మపహరించుకొని, పిదప ఉలాందా, డెన్మార్కు, స్విట్-జర్లాండు, బెల్జియములోనగువానిని క్రమ క్రమముగా నణచి ఇటలిని స్వాధీన పఱచికొని తుదను ఇంగ్లాండుపై కలహమునకు కాలు ద్రవ్వవచ్చు-ననియు ఆంతవఱకును ఆంగ్లేయులను వంచించుచురావచ్చుననియు అభి-ప్రాయపడిరి. ఇది యిట్లుండ: గడచిన కొన్ని సంవత్సరములుగా ఐర్లాండు దేశపు ప్రజలు తమదేశపు పరిపాలన విషయమున అతృప్తులై రాజాంగము వారితో తర్కించుచుండిరి. హిందూదేశ మందును ప్రజలు తమకు స్వరాజ్య పరిపాలన విషయమై కొన్ని స్వాతంత్ర్యముల నిమ్మని కాంగ్రెస్ మహాసభ మూలముగ ప్రతి సంవత్సరము వేడుచుండుటయు, కర్జన్ ప్రభువు కాలమున బంగాళము రెండు భాగములుగ విభజింపబడి అందుచే నాప్రజలు అతృప్తులై యుండుటయు, స్వదేశ వస్తువుల వృద్ధి పఱచుటకు నిక్కలి పట్టుదలతో నుండుటయు, ఇండియాలో నచ్చటచ్చట కొందఱు అనారోగ్యులు రాజద్రోహ కార్యములనుచేసి దేశమున కొన్నిచోట్ల కలతలను కలుగ జేయు-టయు, దక్షిణాఫ్రికాలోని యిండియను లవమానితులయి యాకారణమున నిం-డియనులకుఁ గలిగిన మనస్తాపమును జెర్మని చక్రవర్తి పలువిధముల చక్కగా నెఱిగియుండెను. ఇదియే తగిన సమయమని తలఁచి, ఈయన ప్రకృతమున యుద్ధమున కారంభించినచో ఇండియనులును ఐర్లాండువారును తమతమ స్వదేశములలోని కలతలను వెల్లడిచేసి తమ రాజాంగమువారి నెదిర్చి తనకు సహాయముచేసి తన ప్రభుత్వమునకు లోపడుదురని యొక పిచ్చిభ్రమ గలిగి యుండెనని తెలియవచ్చుచున్నది. ఇది బుద్ధిహీనత కాదె!

ఇండియనులును ఐర్లాండువారును తమకు వలయు స్వాతంత్ర్యములను

పోరుటకై తమదేశపు చట్టముల ననుసరించియే తమ రాజాంగము వారిని న్యాయమైన అర్జీల మూలముననుు విధి పూర్వకమగు మహాసభల మూలముననుు ప్రార్థించెదరేగాని, ప్రభుత్వమువారికి విరోధముగ ప్రవర్తించనే లేదను సంగతి ఆయనకు దెలియదు కాంబోలు. యుద్ధము నడచుచుండు నీ తరుణమున బ్రజలాంగ్లేయ రాజ్యపుం బనులనామోది యనుసరించి నడచికొనుచుండుటను జూడ దన తెలివిలేమి వెల్లడియై యుండును గదా!

---

## 3. CROWN PRINCE OF AUSTRIA

## ఆస్ట్రియాదేశపు యువరాజు

ఆస్ట్రియాదేశము ఐరోపాలోని మధ్యప్రదేశము. దీని విస్తీర్ణము రెండులక్షల అఱువదియొక్కవేల (261,000) చదరపు మైళ్లు. ఇందు పందొమ్మిది స్వల్పజిల్లాలును హంగెరీయనెడి యొక గొప్పదేశమును 1867 సం॥ ఒక్కటిగ చేరి ఓకేచక్రవర్తి పాలనకు లోంబడెను. దీనికి వియన్నా ప్రధాన పట్టణము. దీని ప్రకృతపుచక్రవర్తి పేరు ఫ్రాన్సిస్ జోసెఫ్. ఈయన 1830 సం॥ ఆగస్టు 18-వ తేది జన్మించి 1848 సం॥ డిసెంబర్ 2-వ తేది సింహాసనారూఢుండాయెను. ఈయనకు 84 సంవత్సరముల వయసు. ఈయన రాజ్యతంత్రమున మిగుల సమర్థుండనియు బుద్ధిమంతుండనియు ఐరోపాలో మిక్కిలి ఖ్యాతి వహించినవాండు.

ఈతని రాజ్యమున వేర్వేఱు మతములకు సంబంధించిన ఐదుకోట్ల పదమూడు లక్షల నలువదివేల (51,340,000) జనులు వసించుచున్నారు. వారలలో ఒకకోటియు పండ్రెండులక్షల ఏబదివేల (11,250,000) మంది జెర్మనివారును, ఋష్యారాజ్యమునకు సంబంధించిన స్లావ్ జాతివారు మూడు కోట్లకధికముగను నున్నారు. సెర్వియాదేశపు జాతితో చేరినవారు 10 లక్షలును, 6,000,000 మాగ్యరులును వేర్వేఱు భాషలు మాట్లాడుచు ఏకమతమునందే భిన్నాచారులై దేశమునందొకరితో నొకరు కలతలు పెంచుకొనుచు పలు తెగలవారొక్కటియై కూడియున్నారు. ఈ చక్రవర్తి అతి ధైర్యశాలి. ఈతనికి గుఱ్ఱపురౌతులును కాల్బలమునుజేరి యిరవదియైదు లక్షల

వీరులును, నవీనపద్ధతుల ననుసరించి 23,000 వీరులను గల 40 యుద్ధనావలును, 20,000 రిజర్వ్ నావ పనివాండ్రును, 408 ఆకాశ యానములు నుండెను.

కడచిన కొన్నిసంవత్సరములుగా ఈయన తన వార్ధకదశచే శక్తి-హీనుఁడై తన రాజ్యవిషయములలో ననేకములను యువరాజగు ఆర్చ్‌డ్యూక్ ఫ్రాన్‌జు ఫెర్డినాండు అనెడి యతిసమర్థుడగు బాలుని స్వాధీనముచేసి తాను పైవిచారణ చేయుచువచ్చెను. ఈయువరాజు అతిబుద్ధిమంతుడు: అతిధీరుఁడు: రాజ్యతంత్రములయం దతిసమర్థుఁడు: దైవభక్తిగలవాఁడు: అయినను, ముష్కరగుణమును అహంభావమును అధికముగగలవాఁడు. ఈతఁడు జెర్మనిచక్రవర్తికి ప్రాణమిత్రుఁడు. ఇతఁడు తనదేశపు వర్తకమును వృద్ధిచేసి దేశము నున్నతస్థితికిఁ దేవలయునను నెన్నికతో ముప్పదిసంవత్సరములుగ తనదేశపు చక్రవర్తి పైవిచారణక్రింద నుండెడి బోస్నియా, హెర్‌జ్‌గోవినా అనెడి స్వతంత్రరాజ్యములను 1908-వ సం॥ అక్రమముగా తన దేశముతో చేర్చి-కొనెను: కావుననే ఏడ్రియాటిక్ సముద్రతీరముననుండు స్వల్పరాజ్యముల వలన బాధకలుగకుండ వానిని కాపాడుటకై ఆసముద్రమున నావికాసైన్య-మును సిద్ధముచేసియుండెను. ఈతడు హాస్‌బర్గువంశీయుఁడైనందున జెర్మని మతాచారములయందు అత్యంతాభిమానము గలిగి తన దేశమునందుండు జెర్మని వారికి సౌకర్యములను విస్తారముగా కలుగజేసినదేగాక, తక్కినజాతులవారిని మిగుల నవమానించుచును హింసించుచు నుండెను. ఇందుచే నీతఁడు బహుజనవిరోధియై వారి కోపమునకు పాత్రుఁడయ్యెను.

ఈతని దేశమునందుండెడి స్లావ్‌జాతివారివలనను మాగ్యర్ జాతివారి వలనను దేశమునం దప్పుడప్పుడు కలహములు వృద్ధియగుచుండెను. ఈయన వాటినడంచుచువచ్చెను: స్లావ్ తెగవారికి వారి జాతితో చేరిన రాజగుపీటర్ అనువాడు రహస్యముగా సహాయము సేయఁగలఁడని తలంచి వాని దేశమగు సెర్వియా యనెడి స్వేచ్ఛాధికారము గల చిన్నరాజ్యముపై కన్నువేసెను. వీని తలంపులకును చేష్టలకును చక్రవర్తి పూర్తిగ సమ్మతింపకపోయినను, వీని ప్రాణస్నేహితుఁడగు జెర్మనిచక్రవర్తి తనకు బహుకాలముగనున్న యభిప్రా-యమును నెఱవేర్చుకొను యోచన గలవాడై వీనిని ప్రోత్సాహపఱచి వీని కృత్యముల కామోదించి వీనికి సహాయభూతుడై యుండెను.

---

## 4. CAUSES OF THE WAR

## యుద్ధ కారణములు

సెర్వియా, బల్గేరియా, బోస్నియా, హెర్జ్‌గోవినా అను దేశములు పూర్వము టర్కీసుల్తానుగారి పాలనకులోఁబడి యుండినవి. ఈ దేశవాసులలో నధిక సంఖ్యగల జనులు క్రైస్తవులుగానుండుటవలన తురక దొరతనమునం దిష్టములేనివారై ప్రత్యేకమగు నొక దొరతనము నేర్పఱచుకొనందలంచి, 1878-వ సంవత్సరమున నొక పెద్ద కలహమును గావించిరి. వీరిలో నధిక జనసంఖ్యగలవారు స్లావ్ తెగలోనివారగుటచేతను, సెర్వియా, బోస్నియా, హెర్జ్‌గోవినాలలోని దేవాలయములలో నధికసంఖ్యగలవి ఋష్యాదేశపు ద్రవ్యసహాయమువలన గట్టఁబడినవి యగుటచేతను, ఋష్యా చక్రవర్తిగారు వీరికి సహాయముచేయ మొదలుపెట్టిరి.

ఇది యోచించిన టర్కీ సుల్తాను తన తెగలోని మహమ్మదీయులలో విశేషభాగమువారు ఇండియాలో గాఁపురముండుటవలనను, ఈజాతివారి యభివృద్ధిని గూర్చి చక్రవర్తినియగు విక్టోరియా మహారాణి మిక్కిలి యాసక్తితోఁ జూచుచుండుటచేతను, ఋష్యాచక్రవర్తియు విక్టోరియారాణికి దగ్గర చుట్టమగుటచేతను, ఆమెవలనఁ దనకు మేలుగలుగునని యెంచి యీవిషయమునఁ దనకు సహాయముచేయుటకై యారాణిని బ్రార్థించెను.

ఆసమయమునం దాస్ట్రియాచక్రవర్తియుఁ దమదేశపు వ్యాపార సౌకర్యములకై కొన్ని రేవుపట్టణములను సంపాదింపందలఁచుకొని తనమిత్రుఁడగు జెర్మనిచక్రవర్తితో నాలోచించి, ఆ యిరువురును గూడి విక్టోరియా మహారాణికి తెలిపించగా నామె యొక విధముగా మధ్యస్థముచేసెను. ఈమధ్యస్థము ననుసరించి సెర్వియాదేశమును బల్గేరియాదేశమును ప్రత్యేక రాజ్యములయినవి. బోస్నియా హెర్జ్‌గోవినా రాజ్యములు రెండును ఆస్ట్రియాచక్రవర్తిగారి పైవిచారణకు లోఁబడవలసినవనియు, ఆదేశమున నుత్పత్తియగు పన్నులలో నధికభాగము టర్కీసుల్తానునకుఁ జేరవలసినదనియును దీర్మానింపఁబడి, అప్రకారమే వీరందఱును బెర్లిన్ పట్టణమున నొక యొడంబడిక వ్రాసికొనిరి.

ఇట్లు ప్రత్యేకముగా నేర్పడిన సెర్వియారాజ్యముయొక్క విస్తీర్ణము

18,660 చదరపుమైళ్లు గలదయ్యెను. దీనికిఁ బెల్గ్రేడ్ నగరము ముఖ్యపట్టణము. దీనియొడయఁడు పీటరనునతఁడు. ఇతఁడు 1844 సం॥ జూలై 29-వ తేది జనించి 1903 సం॥ జూలై 2-వ తేదిని బట్టాభిషిక్తుఁడయ్యెను. సాధారణ సమయమున వీరియొద్ద 50,000 వీరులు గల సేన సిద్ధముగా నుండుట గలదు. యుద్ధ సమయమున 3,50,000 వీరులు గల పటాళమునుఁ గూర్చుటకు వీరికి వీలగును. వీరివద్ద 60 ఆకాశయంత్రములు సిద్ధముగానుండెను. దీనియం దిరువదితొమ్మిదిలక్షల పదునొకండువేల (2,911000) జనులు కాపురము చేయుచున్నారు. వీరిలో నధిక సంఖ్యగలవారు స్లావ్ తెగలోని వారు. ఆస్ట్రియాయొక్క పైపిచారణకు లోఁబడిన బోస్నియా హెర్‌జ్-గోవినాలలోఁ గాఁపురముండు స్లావ్ తెగవారు కొన్నియేండ్లనుండి యాదేశపు యువరాజు వలన నవమానితులయి తమ మతమునకు సంబంధించిన యాచార వ్యవహారములను జరుపుకొనఁ జాలనివారగుటచే నతనియం దసూయనొంది తమ మతాచారములను ధారాళముగా నడుపుకొను నిమిత్తము సెర్వియాలోని తమవారింగలసి యందులకుఁ దగిన ప్రతీకారమేమని యాలోచింప, సెర్వియా రాజు పైరెండు దేశములలోని వారికి సైన్యమున సహాయముసేయవచ్చునని యాలోచించుచుండగా, ఆస్ట్రియా యువరాజెఱింగి తన పైపిచారణలోనున్న బోస్నియా హెర్‌జ్‌గోవినాలను 1878-వ సంవత్సరమున బెర్లిన్ నగరమున జేసికొన్న యేర్పాటుల నతిక్రమించి, 1908-వ సంవత్సరమున దన రాజ్యమునఁ గలుపుకొని, సెర్వియనులవలను నితర చిల్లరదేశముల వలనను గలహములు గలుగనీయకుండుటకు బోస్నియాలో నొకపెద్ద సైన్యమును ఏడ్రియాటిక్ సముద్రమున గొన్ని యుద్ధనావలను నచటఁ గాపుంచెను.

ఆతరుణమున ఋష్యావారికిని జపానువారికిని ఘోరయుద్ధము జరిగి యందు ఋషియనులకు విశేషజననష్టమును ధననష్టమును సంభవించి యున్నందునను, తామొకవేళ సెర్వియావారికి సహాయముగాఁ బోయినయెడల జెర్మనులాస్ట్రియావారి పక్షమునఁ జేరుటతప్పదని తెలియవచ్చినందువలనను, సెర్వియనులకు సహాయముచేయుట కది కాలముగాదని యూరకుండిరి.

ఈ సంగతి నెఱిఁగిన యాస్ట్రియాయువరాజును సమయము చూచి సెర్వియావారి నణచివేసినయెడల నచ్చట తనపెద్ద యొకసైన్యము నిలిపి సమీపమున నుండు చిల్లర దేశములను మెల్లగా తన స్వాధీనము జేసికొన వచ్చు

ననియు నందువల్ల ననేకదినములనుండియు మధ్యధరాసముద్రమున రేవు పట్టణములను సంపాదింపవలెనని కోరుచుండిన కోరిక కొనసాగుననియు దలంచి తగిన సమయమెప్పుడు వచ్చునోయనియు నెదురుచూచుచుండెను. ఇట్లీ యిరుదెగలవారికిని పరస్పర విరోధము నానాట వృద్ధియగుచుండెను. కాని, యువరాజు మాత్రము దీనిని లక్ష్యముచేయక తనవశమునయున్న రెండుదేశముల కలహకారులను అణంచి మిగుల జాగ్రతతో మెలఁగుచుండెను. ఐనను దేశక్షోభము మాత్రము హెచ్చుచునేయుండెను. ఎవరుచూచినను యువరాజును ద్వేషింప మొదలుపెట్టిరి.

ఈ సంగతి యిట్లుండఁగా, గడచిన సం॥ జూన్ నెల 23-వ తేదినాటి సాయంకాలమున బోస్నియా ప్రధాన పట్టణమగు సెరాజవో నగరమున ఆస్ట్రియాదేశపు సర్వసేనానాయకుఁడును యువరాజునగు ఆర్చ్‌డ్యూక్ ఫ్రాన్ జ్ ఫెర్డినాండు ప్రభువుగారు తమసేనలను జూచు నిమిత్తము భార్యాసమేతులై రాజమార్గమున వేడుకగాఁ బోవుచుండఁగా, స్లావ్ జాతి విద్యార్థి యొకఁడు ప్రిన్ సిప్ అనువాఁడు వీరికడ్డముగా వచ్చి తన వద్దనుంచికొని యున్న చేతుపాకితో నా దంపతుల గాల్చిచంపెను.

యువరాజును గోల్పోయిన యాస్ట్రియా చక్రవర్తియు నింతవఱకును దమ రాజ్యమున జరుగుచుండిన సంగతులనుబట్టి యీ హత్య సెర్వియాలోని రాజకీయ ప్రధాన మంత్రులలోఁ గొందఱి ప్రేరేపణవలన జరిగియుండ-వచ్చునని యూహించి, అట్టివారిని తక్షణమే యుద్యోగమునుండి తొల-గించి తమచే నియమింపఁబడు నధికారులచే వారిని విచారణచేయించి వారు జేయు తీర్మానముల మేరకు వారిని దండింప వలయుననియు, మఱికొన్ని నిబంధనలను వ్రాసి యా నిబంధనలప్రకారముగా నాదేశపు జనులు నడచుకొన నలువది యెనిమిది గంటలలోగా నొప్పుకొన వలయు ననియు జూలై నెల 24-వ తేదిని సెర్వియా గవర్నమెంటువారికిఁ దెలియఁజేసిరి.

సెర్వియాదొరతనమువారును యువరాజుమరణమునకై మిక్కిలి వ్యస-నముఁజెంది, ఆస్ట్రియాచక్రవర్తిగారు చెప్పిననిబంధనలలో ననేకములను వారి యిష్టప్రకారమే యొప్పుకొనిరి. కాని, ఈహత్య తమదేశమునందు జరిగినది కాకపోవుటవలన తమ మంత్రుల కావిషయమున సంబంధముండుటకుఁ దగిన కారణములు లేవనియు, ఐనప్పటికిని సాధ్యమగునంతమట్టుకు శీఘ్రకాలము

నందే యీవిషయమును విచారించి, నేరముచేసినవారు తమ దేశములోనే యుండి తమప్రజలే యైనయెడల వారిని బట్టి తామే దండించి యీసమాచారమును వెంటనే తెలియఁజేసెదమనియు, తమ మంత్రులయందు సందేహ మున్న పక్షమున నింతకుఁ బూర్వమే మధ్యవర్తులుగా నేర్పడియుండు హేగ్ మహా సభవారి సముఖమున శీఘ్రకాలముననే విచారణచేయించి వారు చేయు తీర్మానమిట్టిదని యేర్పడునంత కఱకును వృధాపవాదమునకై తమ మంత్రుల నుద్యోగమునుండి తొలఁగింపమని చెప్పుట యంత యుచితము కాదనియు ప్రత్యుత్తర మిచ్చిరి. ఇందులకు సన్మతింపక, ఆస్ట్రియావారు జూలై నెల 28-వ తేదిని సెర్వియనులపై దాడివెడలిరి.

---

## 5. EMPEROR GEORGE V

## జార్జి చక్రవర్తి

విక్టోరియా మహారాణిగారి మనుమఁడును ఏడవయెడ్వర్డు చక్రవర్తిగారి కుమారుఁడునైన ఈమహనీయుఁడగు మనచక్రవర్తి 1865-వ సం॥ జూన్ నెల 3-వ తేదిని మారల్‌బరో మందిరమున జన్మించెను. ఎడ్వర్డుచక్రవర్తి కీయన రెండవ కుమారుఁడు. వీరి యగ్రజుఁడగు ఆల్బర్టువిక్టర్ 19-వ యేట మృతిఁజెందగా, ఈయన ఆంగ్లేయరాజ్యమునకు యువరాజయ్యెను. ఈయన బాల్యమునుండియు ఓడసేనలవిషయమున మిక్కిలి శ్రద్ధ వహించినవారై తాము ఆసేనలంగలసి వాటి రహస్యముల నెల్ల చక్కఁగా గ్రహించిరి.

ఈయన 1893 సం॥ జూలై నెల 6-వ తేది సెంట్‌జేమ్సు భవనమున టెక్ దేశపు రాజపుత్రియగు విక్టోరియా మేరియను మనోహరాంగిని వివాహము చేసికొనిరి. వీరికి 1894 సం॥ జూన్ నెల 23-వ తేదిని ఎడ్వర్డు ఆల్ఫ్రెడ్ క్రిస్టియన్ జార్జి ఆండ్రూ పేట్రిక్ డేవిడ్ అను పుత్త్రుఁడు పుట్టెను. ప్రస్తుతమాంగ్లేయ రాజ్యమునకు యువరాజీ మహాత్ముఁడే. ఈయన కనంతరము ఉభయకుల పవిత్రయగు నొకపుత్త్రికయు, లోకపాలతుల్యులగు నలుగురుపుత్త్రులును గలిగిరి. సర్వేశ్వరుఁడు వీరి నెల్లరను అక్షయ సంపదయు, వజ్రదేహ

మును, నిరామయమును, దీర్ఘాయువును గలిగించి సుఖులైయుండునట్లు రక్షించునుగాక !—

మనచక్రవర్తి పూర్వము యువరాజుగా నున్నప్పుడు తమ యర్ధాంగలక్ష్మియగు మేరీసమేతులై యింగ్లండును వదలి యిండియా మొదలగు బయటిరాజ్యములలో సంచరించి యందరివలనను బహూకరింపఁబడి తమప్రధానదేశమును జేరిరి. 1910 సం॥ మే నెల 6-వ తేదిని కాలధర్మమునొందిన వీరి జనకునకు దర్వాత నా రాజ్యము నేల నారంభించి, 1911 సం॥ జూన్ నెల 22-వ తేదిని ఆంగ్లేయరాజ్యపట్టభద్రుఁడై యిండియాదేశమునకుఁ జక్రవర్తియయ్యెను. ఆ సంవత్సరము డిసెంబరు మాసముననే భార్యాసమేతులై యిండియాకువచ్చి డిల్లీనగరమున పైనెల 11-వ తేదిని గొప్పదర్బారునం దెల్లరకును దర్శన మొసంగిరి. ఆ తరుణమున ఇండియాలోని మహారాజులందఱును, రాజులును, జమీనుదారులును, జాగీరు మితాదారులును, గొప్పగొప్ప రైతులును, గొప్పగొప్ప విద్వాంసులును గూడి యీయన రాకవలన నానందభరితులై తమరాజవిశ్వాసమును జూపి మ్రొక్కి నిలిచిరి.

ఇండియనుల రాజభక్తి విశ్వాసములకు మెచ్చిన యీ రాజేంద్రుఁడు తమ జన్మభూమి యగు నింగ్లండుచేరి యది మొద లీదేశమునకు మహోపకారము లనేకములు చేయుచువచ్చిరి. ఇప్పుడీయన ఆస్ట్రియాకును సెర్వియాకును యుద్ధ మారంభమగుటయు నదియెఱిగినవెంటనే, ఐరోపాలో నొక మహాసంగ్రామము తప్పక జరుగఁగలదని తలఁచి, దానిని నిరోధించుటకై యనేక ప్రయత్నములు చేసిరి. ఆస్ట్రియా చక్రవర్తికి సెర్వియా దొరతనమువారిచ్చిన ప్రత్యుత్తరము న్యాయమైన దనియును, సెర్వియావారికి కొంచెమైనను అవకాశ మీయక ఆస్ట్రియనులు యుద్ధమున కారంభించుటవలననే ఆస్ట్రియా గవర్నమెంటువారు ఇంతకు బూర్వమే యుద్ధసన్నద్ధులై యుండిరనియు, సెర్వియావారిచ్చిన ప్రత్యుత్తరము నలక్ష్యముచేసి కయ్యమునకుఁ గాలుద్రవ్విన ఆస్ట్రియా చక్రవర్తి జెర్మని చక్రవర్తియొక్క ప్రేరేపణచే నిది యొకమిషగా నుంచికొనెననియు నిశ్చయించిరి.

కడచిన కొన్ని సంవత్సరములనుండియు జర్మానియనులు హేరాళమైన సేనలను జేర్చుచుండుటను ఆంగ్లేయు లెఱింగి తామును దమసేనలను ఆయత్తముచేసి కొనిరి. జెర్మని చక్రవర్తియును ఆంగ్లేయ చక్రవర్తియు పర-

స్పర విరోధభావము లేవియు ప్రకటింప కుండినను, ట్రాన్స్‌వాల్ యుద్ధము నడచినప్పుడు జెర్మని చక్రవర్తి యాంగ్లేయుల కార్యముల నామోదింపక క్రూగర్ ప్రభువున కంపిన తంతి సమాచారము నాంగ్లేయు లెఱింగిన నాట నుండియు నతనియందు సందేహము గలవారై ఒకరికొకరు బాహ్యస్నేహము చూపుచు వచ్చిరేగాని యంతరంగ విశ్వాసములేనివారై యెవరిమట్టుకు వారు గూఢముగా సేనలను హెచ్చించుచు నేవచ్చిరి.

ఇప్పుడు సంభవించియుండు యుద్ధమున దామును చేరవలసి వచ్చునని తలఁచి మనచక్రవర్తి యీ యుద్ధమును నిలుప బుష్యావారికిని జెర్మనివారికిని సమాధానముచేయ యత్నించుటలో, రుష్యాచక్రవర్తి మాత్రము వీరి మాటల నంగీకరించెను. ఆస్ట్రియాచక్రవర్తియును మన చక్రవర్తి యభిప్రాయము ననుసరించి సెర్వియావిషయమునఁ గొంచె మనుకూలముగ యోచించునట్లే యొప్పుకొనిరి. అయినను, జెర్మని చక్రవర్తి బహుదినములనుండియు తనమనంబున నున్న కోరిక నెరవేర్చుకొనుటకై తానే యీ యుద్ధమునకు ప్రేరకుఁడయ్యెననుట యెల్లరు నెఱుఁగ, గడచిన జూలై నెల 25-వ తేది (సెర్వియావారి ప్రత్యుత్తరము వచ్చుటకుఁ బూర్వమే, అనఁగా ఆస్ట్రియావారు సెర్వియా వారికి సమాచారమంపిన మరునాఁడే) ఫ్రాన్సు దేశపునెల్ల వెంబడిగా తమ సేనలను నిలిపి, కోటలను భద్రముచేసి, ఫ్రాన్సువారి దారుల నడ్డగించి, బండ్లను రానీక నిలిపి. తంతులను ద్రెంచి యార్భాటము చేసెను.

ఈయకార్యముల నెఱింగిన జార్జివల్లభుఁడు ఇఁక సంధి కుదరదని యెంచి, తాము సహాయము చేయనొప్పుకొని యుండు నితరరాజ్యముల విషయములను గూర్చి యోచింపఁబూనిరి.

---

# 6. BELGIAN NEUTRALITY

## బెల్జియముయొక్క మధ్యస్థము

బెల్జియమనునది జెర్మనికిఁ బడమటను ఫ్రాన్సుదేశమున కీశాన్యమునను గల యొక చిన్నరాజ్యము. దీని వైశాల్యము పదునొకండు వేల మున్నూట డెబ్బది (11,370) చదరపుమైళ్లుగలది; అనఁగా మైసూరుసంస్థానము యొక్క వైశాల్యములో సగభాగమునకన్నఁ దక్కువయే. ఇది యొక స్వతంత్రరాజ్యము. దీనియందలి జనసంఖ్య డెబ్బదినాల్గులక్షలు (7,400,000). వీరిలో నధిక సంఖ్యగలవారు ఆంగ్లేయులును ఫ్రెంచివారును.—దీనికిఁ బ్రధానపట్టణము బ్రుస్సెల్సు. దీనిని ఆల్బర్టనునొక సద్గుణసంపన్నుఁ డేలుచున్నాఁడు. ఈయన 1875 సం॥ ఏప్రల్ నెల 8-వ తేదిని జననమంది 1909-వ సంవత్సరం డిసెంబరు నెల 23-వ తేది ఈ దేశమునకు ప్రభువై సింహాసనమెక్కెను. వీరి వయసు 39 సంవత్సరములు. ఈయన శూరాగ్రేసరుండును దయాసముద్రుండును నైనవాఁడు: దైవభక్తిసంపన్నుఁడు: విద్యావిశారదుఁడు: రాజ్యతంత్రనిపుణుఁడు. ఈయన తన పదునైదవయేఁట (1890 సం॥) యుద్ధవిద్య నభ్యసించుటకై యొక యుద్ధశాస్త్రి పాఠశాలలోఁ జదివి, 1892 సం॥ తమ దేశపు సేనలంగలసి కొన్నియేండ్లు వారితోఁ జక్కఁగా వాడుకపడి సేనాతంత్రము నంతయును జక్క నేర్చి తామే తమ సేనలకు నధిపతియయ్యెను. సమాధానకాలమున వీరియొద్ద 58,000 యుద్ధవీరులుగల సైన్య ముండుట గలదు. యుద్ధసమయమున నీ సైన్యము 300,000 వీరులను గలిగినదగును. యుద్ధారంభమునందు వీరియొద్ద 102 ఆకాశయంత్రము లుండెను.

ఇంతకుఁ బూర్వ మీ రాజ్యము ఉలాందా దేశమునఁ జేరియుండెను. ఇందలి ప్రజలు 1830 సం॥ ఉలాందావారితోఁ గలహించి ప్రత్యేకరాజ్యమును స్థాపించికొనిరి. ఆసమయమున ఆస్ట్రియా, ఫ్రాన్సు, ఋష్యా, ఇంగ్లండు దేశాధీశులొకటిగాఁ జేరి ఉలాందారాజ్యమునకును దీనికిని మధ్యస్థము చేసి పొలిమేర తేర్పాటు చేసి, విక్టోరియా మహారాణిగారికి దగ్గర చుట్టమగు 'లియొపాల్డ్' అనునతని రాజుగా నియమించిరి. ఇది యెప్పటికిని మధ్యస్థస్థితియందే యుండవలయుననియు, ఐరోపాఖండమున నెట్టి యుద్ధము

పొసఁగినను ఈ రాజ్య మందరికిని మధ్యవర్తియై తగవులు దీర్చునదిగా యుండవలయుననియు తీర్మానించి, ఒకవేళ తమయందెవ్వరైన నీరాజ్యముపై దాడివెడలినచోఁ దక్కినవారు బెల్జియనులకు సహాయమొసర్చి రక్షింపవలయుననియు 1831 సం॥ లండన్ నగరమున నొక యొడంబాటు చేసికొనిరి.

ఈ చిన్న దొరతనమువారు తమ మధ్యవర్తిత్వమును నెలకొల్పుకొనుటకును, పై యొడంబడికలోని నిబంధనల నెవ్వరేని మీరినయెడల వారి నడ్డగించుటకును జాలినంత సేనల నుంచుకొనవలయు ననియు, యుద్ధసమయమున నే తెగలోనివారుగాని యీ రాజ్యమునఁ బ్రవేశింతురేని యట్టివారు తమ యాయుధముల దిగ విడిచి ఈ దేశపువారి రక్షణకు లోఁబడవలసినదనియు నేర్పాటులు చేసికొనిరి.

మఱియును, 1839-వ సం॥ పై యుదహరించిన నాల్గు దేశములవారితోను తమదేశ రక్షణకై జెర్మని చక్రవర్తియును డచ్చి (ఉలాందా) దేశపు రాజును జేరఁగా, అందఱు నేకీభవించి పూర్వపు రీతిగానే మఱియొక యొడంబడికను జేసికొనిరి. తరువాత వీరందఱును జేరి బెల్జియమునకు సమీపమైనదియు 1831-వ సం॥ మొదలు దీనివలెనే స్వతంత్ర రాజ్యము నేర్పఱచుకొన్నదియునగు లక్సంబర్గ్ అను నొక చిన్నదేశమును 1867-వ సం॥ బెల్జియమువలెనే మధ్యవర్తిగాఁ జేసిరి.

ఇది యిట్లుండఁ 1870-వ సం॥ జెర్మనికిని ఫ్రాన్సు దేశమునకును యుద్ధము సంభవించినపుడు ఫ్రాన్సున కధిపతియైన మూఁడవ నెపోలియన్ అను నతఁడు బెల్జియముయొక్క మధ్యస్థస్థితినిఁ జెడఁగొట్ట యత్నించుటను రహస్యముగా నెఱింగిన విక్టోరియా మహారాణి బెల్జియమునకు సంభవింపఁబోవు నాపదను ఆ రాజున కెఱిఁగించినది మాత్రమే గాక, ఒడంబడిక ప్రకారము దాను సహాయముచేయుటకు సిద్ధముగా నుండుటను దెలియఁజేసెను. అందుమీఁదట పై రెండు కక్షులవారును విక్టోరియా మహారాణితోఁ బ్రత్యక్షమున మాటలాడుటయందా యిరుదెగలవారియొద్దను ఆయమ బెల్జియము యొక్క మధ్యస్థ స్థితిని గాపాడుట ముఖ్యమైనదని దెలియపఱచిరి. అందున కనుకూలముగా ఫ్రాన్సువారును జెర్మనివారును దమ యుద్ధమున బెల్జియము దారిని వదలి దాని కాగ్నేయమున నున్న మెట్స్ స్ట్రాస్బర్గ్లను పట్టణముల మీఁదుగా నొకరి నొక రెదిరించి యుద్ధము చేసిరి. ఇప్పుడ

న్నవో యీ మార్గమున ఫ్రెంచివారిచే దృఢములైన కోటలు కట్టఁబడి విశేష సైన్యము కాపుగా నుంచఁబడియున్నది.

ఆస్ట్రియా సెర్వియాదేశముపై దండెత్తినవెంటనే, సెర్వియాను రక్షించుటకై ఋషియా కడచిన సం॥ జూలై నెల 30 తేదినిఁ దమ సైన్యములనాయత్తముచేయ నారంభించెను. జెర్మనియు నాస్ట్రియాకు తోడుపడుటకుఁ దమ సైన్యముల గూర్చుటయు, మనజార్జిచక్రవర్తి యందులకు మఱల మధ్యస్థము చేయుటకుఁ దగిన యేర్పాటులను జేయుచునుండఁగనే, జెర్మనిచక్రవర్తి 1914-వ సం॥ ఆగస్టు నెల మొదటి తేదిని ఋషియాపై యుద్ధము నారంభించిరి.

1892-వ సం॥ ఋషియాకును ఫ్రాన్సుకును ఏర్పడియుండు ఒడంబడికమేఱకు ఇప్పుడు ఫ్రెంచివారు రుషియాకు సహాయముచేయుట తప్పదని పూర్వమే యెఱిఁగియున్న జెర్మని చక్రవర్తి ఫ్రెంచివారి నడ్డగించుటకై తమ సేనలను తయారుచేసిరి. జెర్మనివారి సేనలు బహుశీఘ్రముగను అత్యంత సులభముగను ఫ్రాన్సుదేశమునకుఁబోవలయు నేని, మధ్యస్థమైన లక్సంబర్గను చిన్నరాజ్యము మీఁదుగా బెల్జియమునఁ బ్రవేశించియే పోవలయును. కావున, జెర్మనిచక్రవర్తి యక్రమప్రవర్తియై తాము 1870-వ సం॥ జేసికొన్న యేర్పాటుల నతిక్రమించి బెల్జియము దారినే పోవఁ దీర్మానించుకొని, తమ పరివారము ఫ్రాన్సుకు బోవ బెల్జియమురాజు దారి నిచ్చుటయేగాక, తమ సేనలకు వలయు సౌకర్యములనుగూడ సమకూర్చునట్లు 1914 సం॥ ఆగస్టు నెల 3 తేది నొకమాత నాతని యొద్దికి నంప, ఆరాజు జెర్మనివారి ప్రార్థన నంగీకరింపక తిరస్కరించెను. మఱునాఁడు విల్లియంచక్రవర్తి తమ సేనలను బెల్జియము యెల్లలోనికిఁ బ్రవేశింపఁజేసి యారాజు మార్గమీయకున్నను దా మామార్గముననే పోవుట తప్పదని మఱలఁ దెలుప, బెల్జియమురాజు మిగులఁ గుపితుఁడై యత్యంత సాహసముతో దారి విడుచుట లేదని ఖండితముగా బలుక, అయ్యిరువురకునుఁ గలహము సంప్రాప్తమయ్యెను. వెంటనే బెల్జియము ప్రభువు మన చక్రవర్తిగారిని దమ కిదివఱలో నేర్పడియున్న యొడంబడిక ననుసరించి తనకు సహాయము సేయఁ బ్రార్థించెను.

జెర్మనివారు బెల్జియమును బట్టుకొనినను, ఫ్రాన్సుదేశము నుత్తరభాగమున యుద్ధము చేసినను, వాని సమీపమున నుండు నాంగ్లేయ దేశమునకు గొప్ప యాపద సంభవింపవచ్చును. ఫ్రాన్సుదేశపుఁ బశ్చిమభాగమునను

ఉత్తరతీరమునను జెర్మనివారితోడ యుద్ధమున నెదిరింతురేని, ఆంగ్లేయులకు సహాయముగా మధ్యధరాసముద్రములోని వారి వర్తకనావలను గొన్ని ద్వీపములను ఇతరములగు చిల్లరదేశముల యుపద్రవము గలుగకుండునట్లు తమ నావికాసైన్యముతోడ గూడి రక్షించుచుండు ఫ్రెంచివారి యోడలు తమ దేశమునకుఁ బశ్చిమోత్తరభాగములకు వచ్చు శత్రువుల నణఁచుటకై వచ్చి చేరుట నిశ్చయము. ఆ సమయమున మధ్యధరాసముద్రమున నాంగ్లేయులకు చాలినన్ని యుద్ధనావలు లేకపోవుచుగాన, ఆ సముద్రతీరములందుండు కొన్ని చిల్లరదేశములు శత్రువులతోఁ గలసి తమ ద్వీపములకును నావలకును ఎట్టి కష్టములను గలిగించునో యని యాంగ్లేయు లాలోచించి, ఫ్రెంచివారి నావికాదళము మధ్యధరాసముద్రముననే యుండవలయుననుట యావశ్యకమని యెంచి వారినచ్చటనే యుంచి, తాము ఫ్రాన్సుదేశపుఁ బశ్చిమభాగమును ఉత్తరభాగమును దమ యోడలతోఁ గాచుచు నుభయుల దేశములను భద్రముగా నుంచుకొనఁ దీర్మానించుకొనిరి.

మన యాంగ్లేయులు ప్రస్తుతము జరుగుచుండు యుద్ధమునఁ దాము ప్రవేశింపవలసినది యత్యంతావశ్యక మగుటచేతను, ఇంతకుఁ బూర్వమే యొడంబడికల మూలమునఁ దాము బద్ధులై యుండుటను బట్టియు, మన యేలిక తమ యేర్పాటుల ననుసరించి బెల్జియమును రక్షించుటకును జెర్మనివారి శత్రువులయిన ఫ్రాన్సువారికి తోడుపడుటకును తీర్మానించి, యుద్ధమును బ్రకటించిన ఆ దినముననే జెర్మని చక్రవర్తికి తమ యొడంబడికను జ్ఞాపకముచేసి యతఁడు దానిని మీఱునెడల తాము బెల్జియములకు సహాయము చేయవలసివచ్చునని యెఱిఁగింపఁగా, జెర్మనిరాజు తమ సేనలు బెల్జియమున బహుదూరము పోయి యున్నవనియు నిఁక వానిని మఱల్చుట యసాధ్యమనియును జెప్ప, మన యాంగ్లేయులు ఆ దినము (అనఁగా 1914 సం॥ ఆగస్టునెల 4 తేది) రాత్రి పదిఘంటలకు జెర్మనివారిలో ధర్మమే జయమని యుద్ధమునకు మొదలు పెట్టిరి.



# 7. THE ALLIES AND THE COMPACT

## మిత్రులును ఏర్పాటును

### 1. THE FRENCH: ఫ్రెంచివారు

ఫ్రాన్సు దేశము ఇంగ్లాండునకు దక్షిణభాగమున నుండునది. దీనికిని ఇంగ్లాండునకును 20 మైళ్లు దూరము. ఈ రెంటికిని నడుమ సముద్ర మున్నయది. ఈ దేశపు వైశాల్యము రెండులక్షలయేడు వేల (207,000) చదరపుమైళ్లు: అనఁగా, బర్మారాజ్యమునకన్నను జిన్నది. ఇందలి జనసంఖ్య మూఁడుకోట్ల తొంబదియారు లక్షలు (39,600,000). ఇది యొక ప్రజాపరిపాలిత రాజ్యము. అప్పుడప్పుడు ప్రజలవలన నేర్పరుపఁబడిన ప్రసిద్ధుఁడగు నా దేశీయులలో నొకఁడు అగ్రాసనాధిపతియను బిరుదము వహించి రాజ్యము నేలుచుండును. దీనికి పారిసు నగరము ముఖ్యపట్టణము. ఇప్పుడు పాయిన్ కేర్ అనునతఁడు రాజ్యమును బాలించుచున్నాఁడు. ఇతఁడు 1911స౦॥ జనవరి నెల 13 తేదిని ఈ రాజ్యమునకు అగ్రాసనాధిపతి యయ్యెను. ఈ ఫ్రాన్సు రాజ్యమునకు సైతము అయిదు ఖండములందునుఁ గొన్ని రాజ్యములు గలవు.

సమాధాన కాలమున నీ దేశమున ఏడులక్షల (700,000,) వీరులుగల సైన్యముండును. ఈ దొరతనమువారి యొద్ద నిప్పుడు యుద్ధమున మిక్కిలి నేర్పుగలిగిన యాశ్విక సేనయును పదాతులును జేరి 4,000,000 యుద్ధవీరులును అనేక వేల ఫిరంగులును గలవు. పోరాళీమైన యీ సేనలో నొకభాగమైన యిరువదిలక్షల (2,000,000) వీరులు ప్రస్తుతము యుద్ధరంగమునఁ జేరియున్నారు. సముద్ర సైన్యమన్ననో, డ్రెడ్నాట్లు, టార్పిడో బోట్ డెస్ట్రాయరులు, సబ్మరీనులు, క్రూసరులు మొదలగు యానపాత్రములు 335ను, ఏరోప్లేనులు ఆకాశనావలు మొదలగు అద్భుత నూతన యంత్రములు 1,422ను యుద్ధారంభముననుండెను. ఈ సంఖ్య నానాటి కభివృద్ధి యగుచున్నది.

1904 వ-స౦॥ ఏప్రల్ నెల తేదిని నీ దేశమువారికిని ఆంగ్లేయులకును బహుదినములుగానుండిన మనస్తాపము ఎడ్వర్డు చక్రవర్తిగారి యేర్పాటువలన నుపశమనమంది యొక సమాధాన యొడంబడిక గలిగినది. దానివలన, ఫ్రెంచివా రాంగ్లేయులకు సహాయముగా మధ్యధరాసముద్రమును రక్షించునట్లును

యందులకు మారుగా నాంగ్లేయులు ఫ్రాన్సుదేశము నుత్తరభాగమును పశ్చిమభాగమును రక్షించునట్లును ఒప్పుకొనిరి.

జెర్మనివారు కడచిన సం॥ జూలై నెల 25 తేది ఫ్రాన్సుదేశపు యెల్ల వెంబడిగా జేరి యల్లరిచేయుటయు, ఆగస్టు నెల మొదటి తేదిని ఋషియామీఁదికి దాడి వెడలుటయును జూచి, ఫ్రెంచివారు తమకును జెర్మనివారికిని గల బహుదినములనాటి పగఁ దీర్చుకొనుట కిదియే సమయమని చెలరేగిరి: ఐనను, యుద్ధ మింత త్వరలో నారంభమగునని యెన్నరైరి: 1892-వ సంవత్సరమున తాము ఋష్యావారితోఁ జేసికొనిన యేర్పాటు ప్రకారము వారికిఁ దోడుపడ సేనలను గూర్ప నారంభించిరి. ఆగస్టునెల 2 తేది (అనఁగా ఋష్యాతో యుద్ధము నారంభించిన మరునాఁడే) జెర్మనివారు మధ్యస్థరాజ్యమగు లక్సంబర్గు అను చిన్నదేశము మీఁదుగా బయలుదేరి ఫ్రాన్సుదేశమునఁ బ్రవేశించి సీరే యనుచోట యుద్ధమున కారంభించిరి.

## ii. THE RUSSIANS: ఋష్యావారు

ఋష్యారాజ్యము ఐరోపాఖండమున సగమునకన్న నధిక విశాలమయి యిరువది లక్షల (2,000,000) చదరపుమైళ్లు గలిగినది: ఇంగ్లాండుకన్నను పెద్దది. ఇందలి జనసంఖ్య పదునారుకోట్ల అరువదియొకలక్ష (166,100,000). దీని కాసియా ఖండమునందును అరువదియైదు లక్షల (6,500,000) చదరపు మైళ్ల విస్తీర్ణముగల దేశములు గలవు. ఇంతకుఁబూర్వము సెంట్ పీటర్స్‌బర్గ్ అను పేరబరగిన పీట్రోగ్రాడ్ దీనికి ప్రధానపట్టణము. దీని నేలువాఁడు జార్ అని చెప్పఁబడును. ఇతనికి చక్రవర్తియనియును బిరుదుగలదు. ఈయన యే విధమైన యితర చట్టములకును లోఁబడక తన యిష్టమునే చట్టముగాఁ గొని తమ ప్రజల బాలింపవచ్చును. ఇప్పు డీ రాజ్యమునకు నికోలస్ అనువాఁడు చక్రవర్తి. ఈయన 1868 వ-సం॥ మేనెల 6 తేదిని జనించి, 1894 వ-సం॥ అక్టోబరు నెల 20 తేది యీ రాజ్యమునకుఁ జక్రవర్తియై సింహాసన మలంకరించి, ఆ సంవత్సరముననే నవంబరు నెల 26 తేదిని విక్టోరియా మహారాణిగారి ద్వితీయపుత్రికయగు అలిస్ మాడ్ మేరి యను రాజపుత్రికిఁ గూఁతురైన అలెగ్జాండ్రా విక్టోరియా యను కోమలాంగిని బెండ్లాడెను. ఈయనకు నలుగురు పుత్రికలు నొక పుత్రుఁడును గలరు. వీరి తల్లియును మన చక్రవర్తి తల్లియును తోఁబుట్టువులు. వీరి భార్యయును జెర్మనిచక్రవర్తి తమ్ముని భార్యయును

అక్కసెల్లెండ్రు. ఈ ఋష్యాచక్రవర్తి విద్యయందును నాగరికమునందును శ్రేష్ఠుఁడు: మహోదయాళువు.

వీరి పూర్వులు తమ ప్రజలకు దేశపాలనవిషయమున స్వాతంత్ర్య మీయఁదలఁచి, ప్రజాప్రతినిధులకు రాజాంగవిషయముల విచారించి తమకు ఆలోచనలు చెప్పు నధికార మిచ్చియుండిరి. ఈ ప్రతినిధుల సభకు 'డూమా' యని పేరు. వీరును బ్రజల కా స్వాతంత్ర్యమును మఱింత హెచ్చుగ నిచ్చి యుండుటవలన వీ రందఱివలనను విశ్వసింపఁబడుచున్నారు.

ఈ చక్రవర్తియొద్ద గుఱ్ఱపుదడములును కాల్బలమును జేరి యిప్పుడు డెబ్బదిలక్షల (7,000,000) యుద్ధవీరులు సిద్ధముగ నున్నవారు. వారిలో నిరువదిలక్షల (2,000,000) వీరులు మాత్రము ఐదువేల (5,000) పిరంగులతో ప్రస్తుత యుద్ధమున ముందుకువచ్చియున్నారు. తక్కిన సైన్యము నిట్లే యిరువదేసి లక్షలుగల భాగములుగా పిరంగులతోడ వేరువేరు మూఁకలుగ సన్నద్ధమై యున్నది. ఇదియునుఁగాక, వీరియొద్ద యుద్ధనావలును అంతర్గాములును జేరి 159 ఓడలు నవీన విచిత్ర యంత్రములతోడను, వేనవేల పిరంగులతోడను, 59,500 పనివాండ్రతోడను యుద్ధమునకు సిద్ధముగా నున్నవి. ఏరోప్లేనులు మొదలగు నాకాశయానములు 818 తాత్కాలిక శిల్పకల్పనాకౌశలము మెఱయ జేయఁబడియుండెను.

ఈ చక్రవర్తి తనదేశీయులకు సంబంధించిన జాతివారైన సెర్వియా ప్రజల క్షేమమును గోరినవాఁడై వారిపై నన్యాయముగ యుద్ధముచేయ నారంభించిన యాస్ట్రియావారి గర్వమడఁపఁదలఁచి యొక పెద్దసేనను గూర్చుచుండెను. ఏతన్మధ్యకాలమున జెర్మనిచక్రవర్తి 1914 సం॥ ఆగస్టునెల మొదటి తేదిని వీరిపై యుద్ధమున కారంభించెను.

## iii. THE COMPACT: ఏర్పాటు

ఇట్లు నిష్కారణముగ యుద్ధమును గల్పించిన జెర్మని ఆస్ట్రియాచక్రవర్తుల నిరువురను ఇఁక నెన్నటికిని దలయెత్తనీక చక్కఁగా మర్దించి వారి గర్వమునణఁచి, ఇఁకపై నైరోపాఖండమున కిట్టికష్టములు గలుగకుండునట్లొనరించి ప్రజలకును చుట్టుపట్టులనుండు చిల్లర రాజ్యములకును సంతోషమును గలిగింపఁ దలంచియు, ఒడంబడికల మూలమున నొకరికొకరు బద్ధులైయుండుట చేతను, ఆంగ్లేయులు ఫ్రెంచివారు ఋష్యావారు నగు మువ్వురును

నొక్కటై తమ కూడిక సేనలను వేరువేరుగానైనను ఒక్కటిగానైనను సమయోచితముగా నడిపి యుద్ధముచేసి బెల్జియమునకును సెర్వియాకును సహాయము సేయ తీర్మానించికొనిరి.

యుద్ధకాలమున వీరొకరికొకరు సమయోచితమైన సహాయములు చేయవలయుననియు, ఒకరిని గాదని మఱియొకరు శత్రువుల సమాధాన వాక్యములకు లోఁబడరాదనియును కట్టుబాటుచేసికొనియు నున్నారు.

ఐరోపా ఖండము నెల్ల నేకచ్ఛత్రముగా నేలవలెనను దురాశతో నీ మహాయుద్ధమును తలపెట్టిన జెర్మని యొడయఁడగు కెయిసరునకు నెదురులయి యాంగ్లేయులు తమ మిత్రులతోడ సత్యధర్మముల బ్రతిపించుటకును దీనజనులను రక్షించుటకునునై నీ యుద్ధమునఁ బ్రవేశింపవలశినవారైరి. 'ధర్మోరక్షతు' అను నార్యోక్తి తప్పదు గదా ?

---

# 8. COMBINED STRENGTH & RESOURCES

## సంయుక్తబలమును ఆధారములును

చాలినంత సైన్యమునుంచికొని యుండః నాంగ్లేయులతో బ్రెంచివారును ఋష్యావారును గలసి బయటి దేశములనుండి వచ్చెడి సేనలను జేర్చికొని ఒక్కమొనగా నిలిచియుండు నాంగ్లేయ సేనల బలమును శత్రువులయిన జెర్మని ఆస్ట్రియా చక్రవర్తుల బలమును సర్వమృగములకు రాజై మిక్కిలి పరాక్రమము వహించిన సింహమునకును ఆకటిచేత డస్సి యాత్రముతోనున్న వ్యాఘ్రమునకును పోల్పదగియున్నవి.

మిత్రమండలముతో గలసిన మన ఆంగేయుల యాశ్వికపదాతి సేనల మొత్తము దాదాపుగా నొక్కకోటి సైన్య మగుచున్నది. శత్రుసైన్యమన్ననో, కొంచెము హెచ్చు తక్కువగా ఎనుబది లక్షలసంఖ్య గలది. కావున నీ రెండు కక్షులవారి బలములు కొంచె మెచ్చుతక్కువగా సమానములే యనవచ్చును. ఆంగ్లేయులయు వారి మిత్రులయు నైక్యనావికా సైన్యములో 1,282 నావలపై రెండున్నర లక్ష పనివాండ్రతోను అనేక సహస్ర శతఘ్నులతోను 2,990 ఆకాశయానములతోడను బ్రకాశించు చుండుటయే

గాక, ఇంకను బయటి దేశములనుండి యనేక నావలును ఫిరంగులును గుఱ్ఱపు సేనలును పదాతిబలమును అవిచ్ఛిన్నముగా వచ్చుచునే యున్నవి.

శత్రువుల కన్ననో 358 ఓడలును, 1,468 ఆకాశయానములును సుమారు 150,000 ఓడపనివాండ్రకన్న నెక్కుడుగా గలరు. ఈ యిరుదెగల వారి శక్తి సామగ్ర్యములను పోల్చిచూడఁగా, ఆంగ్లేయుల మిత్రసైన్యములో సరాసరి మూఁట రెండుభాగములకన్న నధికముగా యున్నది. ఐనను, ఆంగ్లేయులకు బయటిదేశములనుండి సహాయము వచ్చునట్లు శత్రువులకు వచ్చుట కేమాత్ర మవకాశము లేదు. జెర్మనివారికన్ననో తమప్రజలే యుద్ధమునకు రావలసినవారై యుండుటవలన, పోనుపోను వారి కృషి చెడి పయిరులు పాడై కూటికే కఱవు సంభవించును. ఈ యుద్ధము చాలాకాలము జరుగు-నేని, జెర్మనివారు చేతనున్న సొమ్మును ఖర్చుచేసికొని కడపట నిత్యోపవాస-ములు చేయవలసినవారగుదురు.

మనచక్రవర్తిగారికిని జెర్మనివారికిని యుద్ధమారంభమైనదని విన్న యిండియనులును బయటిదేశములవారును తమతమ శక్త్యనుసారము సహా-యము లొనరించి తమ రాజవిశ్వాసమునుఁ బ్రకటింప నారంభించిరి. చక్ర-వర్తిగారి ప్రజలు తమ రాజునకు ఇట్టి తరుణమున సహాయము సేయ బద్ధులై యుండుట సహజమేయైనను, వారి ప్రజలు గాని దక్షిణాఫ్రికాలోని డచ్చి-వారును, అమెరికాలోని యొకతెగవారైన యఱువదివేల జనులును, పోర్చు-గల్ దేశమువారును, ఇటలీ దేశములోని యనేకులును మన చక్రవర్తికి సహాయము చేయునట్లు ముందంజవేసియుండుటను జూడ, మన యాంగ్లేయుల సత్య ధర్మ నిరతమైన యేలుబడియే కారణమని తెలియవచ్చుచున్నది.

ఈ యుద్ధమునకు సహాయముగా కనడాదేశమునుండి 20,000 వీర భటులును, 12,000 వేల కొల్ళలమును, 27 ఫిరంగులును వానితోఁ బ్రయో-గింప మూఁడువేల పెద్దపెద్ద గుండ్లును, 500 గుఱ్ఱపు సేనయును, 2,000 వైద్యులును, అనేకులు ఓడ పనివాండ్రును వచ్చియుండుటయే గాక, ఇంకను 100,000 సైన్యమును, 300 యంత్రపుఁ ఫిరంగులును, 7,500 గుఱ్ఱములును రాఁగలవని తెలియవచ్చుచున్నది. ఆ దేశస్థులు వీని కయ్యెడి ఖర్చులనుఁ దామే భరించుటగాక, యుద్ధపు ఖర్చులకై పదునైదు కోట్ల రూపాయలు సైతము పంపెదమని దెలియఁజేసి యున్నారు: ఇదిగాక, పదిలక్షల గోధు-

మల మూటలును బంపియున్నారు. ఆ దేశపు స్త్రీలన్ననో, ఆస్పత్రి యొద్ద నొకదాని నంపునట్లు తెలియవచ్చుచున్నది.

టొరంటో నగరమునుండి తొమ్మిదిలక్షల రూపాయలును, ఒంటేరియోనుండి పదునైదులక్షల రూపాయలును, న్యూఫౌండ్లాండునుండి వేయి కాల్బలమును వేయి నావికాజనమును, ఆస్ట్రేలియానుండి యిరువదివేల యుద్ధవీరులును యుద్ధనావ లనేకములును ఒకటిన్నరలక్ష రూపాయలును, న్యూజీలండునుండి 8,000 సేనయును దాని నెలవులకు 90,000 రూపాయలును ఆంగ్లేయసైన్యముల ఖర్చులకు పన్నెండు లక్షల రూపాయలును, డర్బాన్ దేశమునుండి లక్షాతొంబదియైదువేల రూపాయలును, నెటాలు దేశమునుండి యొక గుఱ్ఱపుసేనయును 75,000 రూపాయలును, ఇండియాయొక్క సాధారణ జనులనుండి డెబ్బదియైదులక్షల రూపాయలును, ఇంకను ననేక దేశములనుండి హెరాళమైన సేనలును రొక్కమును సామగ్రులును వచ్చుచున్నవి.

ఎడ్వర్డు దీవినుండి లక్షమూటల పిండియును, క్వెబెక్ దేశమునుండి నలువదిలక్షల పౌనుల జున్నుపాలును, నోవాస్కోషియానుండి లక్ష టన్నుల నేలబొగ్గును, ఆల్బర్టానుండి 8,500 టన్నుల బార్లిపిండియును, కొలంబియానుండి లక్ష పీపాయల అత్తిపండ్లును, సిలోనునుండి పదికోట్ల పౌనుల తేయాకును, మోరీసునుండి ఇరువదిలక్షల పౌనుల చక్కెరయును, ఇట్లు పలువిధములగు నాహార పదార్థములును వచ్చి చేరుచున్నయవి. హిందూరాజులనేకులును తమ దేశపు ఆదాయమునంతయు నిచ్చి తామును దమ సేనల లోని కొన్నిభాగములతో యుద్ధరంగమునకు వెళ్లియున్నవారు.

ఆంగ్లేయుల తూర్పు రాజ్యములలో జెర్మనివారివలన గలహములు గలుగనీయక (1905 సం॥ ఆగస్టు మాసమున నేర్పడి మఱల 1911-వ సం॥ నూతనముగ మార్చికొనిన యొడంబడిక ప్రకారము) జపానేయులు సముద్రముల రక్షింప నొప్పుకొనిరి. టిబెత్తుదేశపు బౌద్ధమతమువారి లోకగురువును రాజును నైన డలాయి లామా యనునతఁడు వేగురు టిబెత్తు సైనికులను బంపునట్లు తెలియఁజేసి యున్నాఁడు.

మనచక్రవర్తికి మఱఁదియు టెక్ దేశపు సామంతరాజునునైన అలెగ్జాండరను రాజకుమారుఁడు ఆంగ్లేయ సైన్యమునఁజేరి యుద్ధముసేయ వచ్చి యున్నవాఁడు. పూర్వము పోర్చుగల్ దేశమునకు పెద్దరాణిగానుండిన ఎమిలి

యను నామెయు, వెస్ట్‌మిన్‌స్టర్ సీమంతినీలలామయు, మఱియును గొన్ని గొప్ప కుటుంబములఁ బుట్టిన యుత్తమాంగనలును, ధనవంతుల యిండ్ల బుట్టిన మానినీ మణులును యుద్ధమున గాయము దగిలిన యుద్ధవీరుల కుపచారములు సేయ యుద్ధరంగమున కేగియున్నారు. చక్రవర్తిగారి స్వదేశముననే సాధారణ ప్రజలు యుద్ధపు ఖర్చులకై యిరువదిరెండున్నరకోటి రూపాయ లిచ్చినదేగాక, పదిలక్షల జనులు సైన్యమునఁ జేరిరి. ఇంకను, గంట 1-కి నన్నూర్గురికన్న నెక్కువ జనులు సైన్యమునఁ జేరి యుద్ధము సేయ తయారుగానున్నారు.

ఇట్లు హేరాళమైన పలుదెఱగుల సహాయములు ప్రతిదినము హెచ్చుగుచునే యున్నవి. ఈ యుద్ధ మెన్నిసంవత్సరములు జరిగినను మన దొరతనమువారికి జనమునకును ధనమునకును గొంచెమైనను గొఱతయుండదు: యుద్ధమువలని శ్రమ యిట్టిదని సైతము తెలియఁజాలదు. మన దొరతనమువారు ఇంతటి సంపత్తు గలవారని యంద ఱెఱుంగవలయును. ఆధారములేక బుద్ధిహీనతచేతను దురభిమానముచేతను దెలియవచ్చెడి పుక్కిటి పురాణముల విని భయభ్రాంతులు గావలదు.

---

## 9. THE WAR

## యుద్ధము

ఇంతటి ధనబలమును సేనాబలమును గల మన యాంగ్లేయులు యుద్ధమునకు ప్రారంభింపఁగానే, ప్రజా పరిపాలక ప్రభుత్వము గల యమెరికా దేశమువారు మధ్యవర్తులుగా నుండఁ దీర్మానించుకొనిరి. ఇతరములగు చిల్లర రాజ్యములవారును ఇప్పు డొకవేళ మధ్యస్థులుగా నుండినను, శీఘ్రకాలముననే వారిలో ననేకులు ఆంగ్లేయులతోఁ జేరుదురు.

ఆస్ట్రియా జెర్మను లొకటై యుద్ధమునారంభింప, ఇంగ్లండు ఫ్రాన్స్ రుషియా బెల్జియం సెర్వియా జప్పాన్ దేశములొకటై ఎదురించుచున్నవి. వీరి యుద్ధ మింతశీఘ్రములో వచ్చునని తలంపనివారైనందున, శత్రువులగు జెర్మనుల సేనాసంఖ్య యింతయనియును, ఈయీ స్థలముల చేర్పఁబడియున్నదనియు, ఈ యీ సమయమున నెదిరించుననియు వెంటనే తెలిసికొన

సాధ్యము గాకపోయెను. జెర్మనివారన్ననో, చాలాకాలముగా కలహమునకు కాలుద్రవ్వుచున్నవారు కావున, వలయు సౌకర్యములన్నిటిని దృఢముగాచేసి యుంచుకొనిరి. నూతన యుద్ధోపకరణముల ననేకములను సిద్ధముగా చేసి యుంచిరి. సైన్యమున్ను మిగుల బలవంతమైనదియే. వీరిని క్రూరమైన యుద్ధముచేతనే జయింపవలసియున్నది. ఐనను, వీరు అక్రమముగా యుద్ధము నారంభించిరి గావున, తుదకు జయమొందుదురనుట విశ్వసింపఁదగినది కాదు. తగిన కారణములేవియు లేకయే ఆస్ట్రియాదేశపు యువరాజు మరణమును నొక వ్యాజముగా నుంచుకొని యుద్ధము నారంభింపగా, ధర్మమును మున్నిడుకొని మన యాంగ్లేయులు దీన ప్రవేశించిరిగాన, వీరే జయింతురనుటకు సందేహ మించుకైనను లేదు. ఆంగ్లేయుల సైన్యబలము నిప్పుడు వృద్ధి జెందినది.

మన సార్వభౌములు దమ సముద్రబలమునకు జెల్లికో అను నతనిని, మెట్టబలమునకు సర్ జాన్ ఫ్రెంచ్ అను నతనిని నాయకులనుగా నియమించి, కిచ్‌నర్ ప్రభువును యుద్ధమంత్రిగ జేసిరి. ఫ్రెంచివారి భూసేనలకు జాఫర్ అనునతనిని, నీటి సైన్యమునకు బాని డీ లా పెయరి అనునతనిని అధిపతులను జేసిరి. ఋష్యాసేనలకు నికోలస్ ప్రభువు అధిపతి యయ్యెను. బెల్జియపు సేనలకు దాని యొడయడగు నాల్బర్ట్ ప్రభువే నాయకుఁడయ్యెను. జెర్మని చక్రవర్తి తమ సాగరసైన్యమునకు వాన్ ఇంగనోల్ అను నతని నధిపతిగను, నేలసేనలకు హెల్‌మత్ వాన్ మోల్‌ట్‌క్ అనునతని నధిపతిగను నియమించి, తమ సేనల కన్నింటికినిఁ దామే సర్వసేనానాయకులైరి. ఇట్లొకరి సేన లొకరి నెదిరింప, ఋష్యావారును సెర్వియావారును గలసి ఆస్ట్రియా మీఁదికిని, ఆంగ్లేయులును ఫ్రాన్సువారును గలసి జెర్మనివారి మీఁదికిని వెడలఁగా, బెల్జియనులు అక్రమముగాఁ దమ దేశమునం బ్రవేశించిన జెర్మనివారికి దారి నీయక యడ్డగించి వారి సేనలను చిందర వందర గావించిరి.

ఆంగ్లేయులును ఫ్రెంచివారును జెర్మనివారి టోగోలాండును బట్టుకొని ఆస్ట్రియాతో ఏడ్రియాటిక్ సముద్రమున నోడయుద్ధము చేసి, వారి యోడలను ముంచియును అల్సెస్‌లోరేన్ దేశపు కొన్నిభాగములను మఱలఁ దమవశము చేసికొనియు, ముల్హ్యాసనునుండి జెర్మనివారిని దఱిమియు, ఫ్రాన్

సునందు జెర్మనివారు ప్రవేశించు సమయమున ననేక దినము లనేక స్థలము-లందు మహాశౌర్యముతోఁ బోరాడి వారి నడ్డగించియు, సమయోచితముగా శత్రువులను నెదిరించి యనేకుల్ను ఖైదీలుగాఁ బట్టియుంచియు నున్నారు.

ఋుష్యా వారన్ననో, ప్రషియాలోఁ బ్రవేశించి జెర్మనివారిని దఱిమి-యును వారి పిఱంగులఁ దమ వశము చేసికొనియును, గలీషియాలోఁ జొచ్చి ఘోరయుద్ధమును గావించి 80,000 జెర్మనివారిని ఆస్ట్రియావారిని బట్టుకొని తమదేశమున కంపి యందు కారాగారమున నుంచియు, ఆస్ట్రియా దేశమునం-తర్భాగమునఁ బ్రవేశించి ఘోర యుద్ధమును జేసిరి. సెర్వియాతోఁ గలిసికొని బోస్నియాలోఁబోరాడి,మాంటినీగ్రో దేశమువారిని తమతోఁగలుపుకొని బోల్-జనిడ్జా యనుచోట ఆస్ట్రియావారిని జావఁగొట్టిరి. జెర్మనిలోఁ బ్రవేశింపవ-లెనని దాని తూర్పుకెల్లకు నిరువదిమైళ్లదూరమున జేరిరి. ఈ తీరున వీరు శత్రు-వుల నెదిరించి యెచ్చటఁ జూచిన నెత్తురు వఱద లగునట్లు పోరుచున్నారు.

జెర్మనివారన్ననో, బెల్జియమున బెద్ద యనర్థము గావించి ఇండ్లు అగిలించుయు, గ్రామములఁ గొల్లగొట్టియు, పట్టణములఁ బాడుచేసియు, ఫ్రాన్సు దేశమునఁ బ్రవేశించి దాని ప్రధాన పట్టణమైన పారిసును సమీపించి పిదప నిరువదిమైళ్లు వెనుకకుఁ బోయి యందు గొప్పయుద్ధమును గావించి కొన్ని కోటలను బట్టణములను బట్టుకొని తమ సేనల నందుంచి యుండఁగా, మఱల వారి నాంగ్లేయులు సమీపించి యా పట్టణములఁ దమవశము చేసి-కొనుటయు, వానిని మఱల జెర్మనివారు పట్టుకొనుటయు, ఫ్రాన్సువారు జెర్మనివారిని దఱుముటయు నిట్లనేక స్థలముల జయాపజయములు దినదినమునను మారిమారి పెలుగుచునే వచ్చుచున్నవి. జెర్మనివా రున్నట్టుండి యుద్ధ-ము నారంభించినందున, ఫ్రాన్సుదేశమునఁ కొన్నిచోటులను బెల్జియము-లోని గొప్పభాగమును స్వాధీనముచేసికొనఁగలిగిరి. అయినను, ఇది వారికి స్థిరమైన జయము కాఁజాలదు.

ఆంగ్లేయులును దమ రెండులక్షల సేనలతో ఫ్రాన్సుదేశపు నుత్తర పార్శ్వమున దిగి, ఇండియానుండి వచ్చిన యొకలక్ష సేనను జేర్చికొని మొట్ట మొదట బయటి దేశములనుండి వచ్చియుండిన లక్షసేనను తగిన ప్రదేశముల నుంచి శత్రువులను తుత్తునియలు గావించుచున్నారు.

ఈ యుద్ధమునం దింతవఱకు నారులక్షల నాలుగువేల జెర్మని వీరులు

ఫ్రాన్సుదేశమున ఖైదీలుగ గావింపఁబడి యున్నారు. కొందఱు ఋష్యాకుఁ గొనిపోఁబడిరి. మఱి కొంద ఱాంగ్లేయుల బయటిదేశములందు బంధీకృతులు గావింపఁబడిరి. మనవారిలో సుమారు 560,000 గురు జెర్మనివారిచేఁ బట్టఁబడియున్నారు. ప్రతి దినమును రాత్రిందివములు యెడలేక నెత్రుశేఱులు ప్రవహించుచున్నవి.—మనము భారత యుద్ధమును వినియున్నారమే కాని కనియెఱుంగము. ఇప్పటి యుద్ధమన్ననో దానికన్న మహత్తరమైనదిగాఁ దోఁచుచున్నది.

ఇరుదెగల వారి సేనలును యుద్ధ సన్నాహములతో సహా నిలిచియుండు కళ వైశాల్యము మున్నూటయేఁబది మైళ్లు: అనఁగాఁ జెన్నపురి దక్షిణ మథురల మధ్యప్రదేశము నంతటిది. మఱియొకటి సుమారు 500 మైళ్ల వైశాల్యము గలది. దీనియం దిదివఱకే యిరుదెగలవారికిని అనేక లక్షల సేన హతమైనది: అనేకవేల యోధవీరులు గాయపడిరి: ఇరుదెగలవారిచేతను అనేకులు ఖైదీలుగా పట్టుకొనఁబడిరి. ఇందు జెర్మనివారికి సంభవించిన నష్ట మత్యధికము. ఈ యుద్ధమున ఆంగ్లేయ సేనలకు మాత్రము ప్రతి దినమును మూఁడుకోట్ల రూపాయలకన్న నధిక ధనము ఖర్చు అగుచున్నది. ఫ్రెంచి-వారికిని దీనికన్నఁ గొంచె మధికము సెలవు పట్టుచున్నది. ఋష్యా-వారికి నింతకన్న నధికమే పట్టును. జెర్మనియును వీరివలెనే వెచ్చింప వలసియున్నది. దాని తాత్కాలిక స్థితియన్ననో మిక్కిలి శోచనీయము: దేశమునందు ధాన్యములు సేనల తిండికి చాలునవి గావు: దేశాంతరములనుండి తెప్పించుకొందమన్ననో మార్గములు లేవు: చేతనున్న సొమ్మును నానాట సెలవై పోవుచున్నది: తమ రాజ్యమున బీదలచేత సేవింగ్సుబాంకులలోఁ గట్టఁబడియుండిన రెండువేల యిన్నూట యేఁబది కోట్ల రూపాయలను యుద్ధపు సెలవులకై అన్యాయముగా నంబీదలగు బీదల కడుపు మండించి తీసికొనిరి. యుద్ధమున కింకను విశేష ధనము గావలసియున్నది. యుద్ధ సామానులును నానాటికిఁ దగ్గుచున్నవి. పాపము! వీరేమి చేయఁగలరు? గర్వముకొని హద్దుమీఱి పైకొన్న యక్రమ యుద్ధమువలని ఫలమును అనుభవించి యల్లాడుట న్యాయమే గదా?

ఈ యుద్ధమన్ననో నానాటికి మిక్కిలి ముమ్మర మగుచున్నది. దీన మన రాజప్రతినిధి పుత్త్రుఁడు వీరశయనము నొందెను. బొంబాయిగవర్నరు

కుమారుఁడును గాయపడి తన సేనలతోడ శత్రువులచేఁ బట్టఁబడి యున్నాఁడు. మన యువరాజును ఆశ్వికదళమునఁజేరి యాయోధనము సలుపుచున్నాఁడు. ఆంగ్లేయదేశపు మంత్రియైన ఆస్క్విత్ ప్రభువు కుమారుఁడు యుద్ధరంగమును జేరియున్నాఁడు. జెర్మని చక్రవర్తి మేనల్లుండ్రలో నిరువురు మడిసిరి. జపానువారు జెర్మనివారి స్వాధీనమున నుండు కియూచౌద్వీపమును బట్టుకొనిరి. ఆస్ట్రేలియా దేశమువారు బిస్మార్క్ ద్వీపములను న్యూగిని దేశమును వశపఱచికొనిరి. ఆఫ్రికా దేశములోని జెర్మనివారి రాజ్యముయొక్క పూర్వభాగమును వారి శత్రువులు స్వాధీనముచేసికొనిరి. వారియుద్ధ నావలలో ననేకములు నాశమైనవి. అనేక వ్యాపారనౌకలు మనవారిచేతను వారి మిత్రులచేతను బట్టఁబడినవి. జెర్మనివారి కాహారమును ధనమును దెచ్చిన యోడలు కొన్ని ఆంగ్లేయులకుఁ జిక్కినవి. జెర్మనివారికి సహాయము చేయవచ్చిన తుర్కీవారు ననేక స్థలములలో పరాజితులయి తమ దేశములనుఁ గోలుపోవుచున్నారు. ఆస్ట్రియా చక్రవర్తి ధైర్యముఁ దొలఁగి నిర్విణ్ణుఁ డయ్యెను. జెర్మని సేనలు డయ్యుట కారంభించినవి. ఐనను, కయిజరు మాత్రము కడుధైర్యమును బూనియే యున్నవాఁడు.

---

## 10. TURKISH TREACHERY

## టర్కీ ద్రోహము

టర్కీరాజ్యము ఐరోపాఖండము నాగ్నేయముననుండునది. ఇదియొక మహమ్మదీయరాజ్యము. ఇది పదునైదులక్షలయిరువదియొక్క వేల (1,521,000) చదరపుమైళ్ల వైశాల్యము గలది. ఇందలి జనసంఖ్య మూఁడుకోట్లు నరువదియేడులక్షల యేఁబదివేలు (36,750,000). దీనికిఁ కాన్స్టాంటినోపిలు ప్రధానపట్టణము. దీని యేలికకు సుల్తానని పేరు. ఇప్పుడు మహమ్మద్ ఇమాం సిద్ధిక్ ఉల్ ఇస్లాం పాచ్ఛా యనునతఁడు సుల్తానుగానున్నాఁడు. ఈయన 1844 సం॥ నవంబరు 3-వ తేది జన్మించి, 1909 సం॥ ఏప్రల్ నెల 27 వ తేది పట్టాభిషిక్తుఁడయ్యెను. ప్రస్తుత మీయన వయసు డెబ్బది యేండ్లు.

ఈ రాజ్యమునకు ఆంగ్లేయులు పెక్కుమారులు ఉపకారము చేసి యితర రాజులవలన నాపద గలుగకుండఁదగిన యేర్పాటులు చేసియున్నారు. ఈ సుల్తాను ఇంగ్లీషువారివలనఁ దాను బొందియున్న యుపకారములను మఱచినవాఁడై జెర్మనీవారితోఁ జేరి యాంగ్లేయులకు విరోధములైన పనులను మిక్కిలి వంచనామతియై చేయఁబూనెను.

ఐరోపాయందు యుద్ధము మొదలుపెట్టగానే, ఆంగ్లేయులయొద్దనుండియు ఫ్రెంచివారి యొద్దనుండియు తప్పించుకొని పాఱివచ్చిన జెర్మనీ వారి రెండు యుద్ధనావలు గోబెన్ బ్రెస్లా యనునవి, తురుష్కదేశపు డార్డనల్స్ జలసంధిని జేరినవి. సుల్తానుగారు మధ్యస్థ రాజ్యములవారి యేర్పాటుల ప్రకారము వానిని 24 గంటలలోగా తమ రేవునుండి తొలఁగించియో, లేక అందలి జెర్మానియ యుద్యోగస్థులను పనివాండ్రను తొలఁగించివానిం దమ యధీనము కావించుకొనియో యుండవలసియుండ, తన యధికారమునకు లోఁబడిన యా జలసంధియందే వాటి ననేకదినములు నిలువనిచ్చి యనంతరము వానినిఁ దాము వెలకుఁదీసికొన్నట్లుచెప్పి జెర్మనీయుద్యోగస్థుల నా నావలయందే నిలిపియుంచెను: తుర్కీ నావికాసేనలకు నింతవఱకు నధికారియై యుండిన యాంగ్లేయోద్యోగస్థుని గూడ తొలఁగించెను: అతనికి మారుగా జెర్మనీవాడొకనినే నియమించెను.

సంవత్సర మొకటింటికి పదునైదువేల వ్యాపారనావలు సాధారణముగా మధ్యధరాసముద్రమునుండి నల్లసముద్రముమీఁదుగా ఋష్యాకుఁబోవ నాధారమైయుండు 47 మైళ్లనిడివియు 3 మైళ్లవెడల్పును గల డార్డనల్స్ జలసంధిని పూర్తిగా మందుగుండులచే నిండించి యాంగ్లేయవర్తక నావలు పోవకుండునట్లు చేసి, ఇతఁడు తన నేలసైన్యమును నీటిసైన్యమును తయారు చేయ మొదలుపెట్టెను. ఇతఁడా జలసంధిమార్గమున ప్రేలుడు మందుంచుటచేత, సుమారు డెబ్బది యాంగ్లేయుల వ్యాపారనావలు అచ్చటనుండి యవతలికిఁ బోవఁజాలక యందే నిలిచిపోయినవి: అందువలన వ్యాపారమునకు నిరోధము గలిగించినదేగాక, జెర్మనీవారి యుద్ధనావలు రెండును వీనిని బాధచేయ నవకాశము సైతము గలిగించినవాఁడు: ఆ జలసంధిమూలమున నల్ల సముద్రమున కాంగ్లేయులు పోరాదని దారి నడ్డగించెను. ఇవి యెల్ల మధ్యస్థరాష్ట్రములవారు చేయు కార్యములు గావు గదా? ఇదియును గాక, బాగ్దాదు

పట్టణమునందును మైసపటోమియా నగరమునను గల యాంగ్లేయులను వీరి యుద్యోగస్థులు మిక్కిలి యవమానకరముగ మాటలాడి వారి మిత్రమండలములను విశేషముగా దూషించిరి. ఆంగ్లేయుల పైవిచారణకు లోబడిన యీజిప్టురాజ్యము నెదిరింప సుల్తాను సైన్యములను గూర్చెను. ఇండియాలోని మహమ్మదీయులను తుర్కీమహమ్మదీయులను క్రైస్తవులకు విరోధముగాఁ గలహించుమన్లు ప్రేరేపింప షేక్ అజీజ్ అను నొక తులువ నేర్పాటు చేసెను. ప్రతి దినమును జెర్మనియు లనేకులు యుద్ధసాధనములను దక్కిన యితర సామానులను కాన్స్టాంటినోపిల్ నగరమున జేర్చుచుండిరి. ఇవన్నియు సుల్తానుని సంపూర్ణ సమ్మతముననే నడచియుండవచ్చును.

ఈ దేశపురాజు బహుదినములనుండియు దనకు గర్భశత్రువైన ఆస్ట్రియాతో నిష్పాకేకీభవించి జెర్మనికి సహాయము సేయ సమ్మతించెను. అయినను, ఈదేశపు యువరాజగు ఇజ్జెడీన్ బాచ్చా యనువాఁడు మాత్రము ప్రారంభమునుండియు నాంగ్లేయుల పక్షమునే యవలంబింపవలయునని తీర్మానించియున్నాఁడు. కొన్నిదినములకు ముందు ఈదేశపు మంత్రులును రాజును జేరి యువరాజుగారి సౌధమునఁ గొన్ని రహస్యవిషయముల నాలోచించిరి. 'ఆ సమయమున నీ దేశపు యుద్ధమంత్రి ఎన్వర్ బే యనునతఁడు ఆంగ్లేయుల దూషింపఁగా, యువరాజామాటల కడ్డమువచ్చి యాంగ్లేయుల సద్గుణములను విశేషముగఁ గొనియాడెను. తుర్కీసేనలకు వాన్ సాండర్స్ అను జెర్మని దేశీయుఁ డొకఁడు సేనానాయకుఁడుగా నియమింపఁబడి యున్నాఁడు. ఆ మంత్రాలోచన సభయందు యువరాజు నభిప్రాయములను విరోధముగా వానినిఁ బిలిచి యుద్ధమంత్రి కొన్ని విషయములు చెప్పఁగా, ఆ జెర్మానీయుఁడు యువరాజును ధిక్కరించెను.

యువరాజును దన పనివాఁడైన యా జెర్మానీయుని నోరు మూసికొని సభనుండి తొలఁగి పొమ్మన, ఎన్వర్బే కుపితుఁడై తన పీఠమునుండి లేచి తుపాకిని బూనెను. దీనిం గన్న యువరాజు తనయొద్దనున్న చేతుపాకితో ఎన్వర్బేయనువాని తొడలందును జెర్మనివాని భుజమునను గాల్చి గాయమొనరించెను. నాఁడు మొదలు తుర్కీ యువరాజును ఆ దేశపుఁ బ్రధానమంత్రియు నాంగ్లేయుల పక్షమునే తామవలంబింపవలయుననియు, జెర్మనివారి సహవాసమే తగదనియు సుల్తానుని నిర్బంధించుచువచ్చిరి. ఐనను,

దుర్మార్గుఁడగు నెన్వర్బేయనువాని దురాలోచనలవలన గారణములేకయే యాంగ్లేయులకు విరోధములైన కొన్ని కార్యములు జరుగుచున్నవి. వీనికి సంబంధింపని ప్రధానమంత్రి తమ యుద్యోగమునకు రాజీనామా యిచ్చి తాము తొలఁగుటకు మూఁడు మారులు యత్నించిరి కాని, ఎన్వర్ జేయును దక్కిన జెర్మని సైన్యోద్యోగులును జేరి యతనిని యుద్ధచట్టము ప్రకారము కాల్చి చంపుదుమని తెలియఁజేసిరి. ఇందుచే నతని యెన్నిక కొనసాగలేదు.

తుర్కీవారు మధ్యస్థులైయుండి డార్డనెల్స్ మార్గముగా వచ్చిన జెర్మనివారియోడలలోని జెర్మని పనివాండ్రను తొలఁగించి తుర్కీ వారినే పనివాండ్రుగా నియమించి, జెర్మని సైన్యోద్యోగస్థులను తొలఁగించిన యెడల నింతకుఁ బూర్వ మొనర్చిన తప్పుల మఱచుటయే గాక, యుద్ధానంతరమునను దాని రాజ్య గౌరవములకు హానిరాకుండఁ దగిన యేర్పాటులు చేయుదుమని ఆంగ్లేయులు తెలియఁజేసి యుండియు, తుర్కీ యా మాటలను లక్ష్యము చేయలేదు.

ఆంగ్లేయ ప్రతినిధియుండు చోటనుంచియున్న యాంగ్లేయ ధ్వజపటమును చించి యా స్తంభమును సైతము గూల్చి యింకను పలువిధముల నాంగ్లేయులకు విరోధములయిన కార్యము లొనరించిరి. కడచిన సం॥ అక్టోబరు నెల 29 తేది నల్లసముద్రతీరమున నుండు ఒడెస్సానగరపు రేవుననున్న కొన్ని ఋష్యా వారి యోడలను బాదు చేసినదేగాక, ఫ్రెంచివారి యోడలకును నష్టము గలిగించిరి. దీనివలన ననేకులు గాయపడి పలువురు మృతి నొందిరి. ఇవన్నియు తుర్కీ దేశమువారు ప్రతికక్షులను జేరి యుద్ధము ప్రకటింపకయే చేసిరి. తుర్కీ సుల్తాను మాటలచే స్నేహమును బ్రకటించి కార్యముపట్ల మాత్ర మాంగ్లేయులకును వారి మిత్రమండలమునకును విరోధములగు కార్యము లనేకములు జెర్మనివారి ప్రేరేపణవలన జేయుచుండెను. ఇఁక నూరకున్నఁ దమ గౌరవమునకు హాని గలుగు నని తలఁచి మన యాంగ్లేయులు నవంబరు నెల 1 తేదిని దుర్కీవారితోఁ బోర నారంభించిరి.

ఇంకను సుల్తాను తనకుఁ దెలియకయే యివన్నియుఁ జరుగుచున్న వని మాయమాటలు పలుకుచున్నాఁడు. ఇండియాలోనుండు మహమ్మదీయులందఱును తుర్కీవారి చేష్టలయందు విరక్తులైయున్నారు. ప్రస్తుతము జరుగు యుద్ధము మత సంబంధమైనది కాక పోవుట చేతను, బాల్కను రాష్ట్రమున-

కును వనుకను జరిగిన యుద్ధమున దమరాజ్యమును స్థాపించిన యాంగ్లేయు-లకు విరోధులగు జెర్మనివారితోఁ జేరి యుద్ధమునకుఁ బ్రారంభించుట చేతను, ఇండియాలో నుండు మహమ్మదీయులందఱును హైదరాబాదు నవాబు-తోసహా తుర్కీ నడతలను దూరుచు సర్వవిధముల చేతను నాంగ్లేయులకు విధేయులైయుండునట్లు తీర్మానించుకొనిరి.

కృతఘ్నుఁడగు నీసుల్తాను దురభిప్రాయము గలవాఁడై యాంగ్లేయుల మోసపుచ్చ నెంచి తన్నుఁ గట్టఁ ద్రాళ్లు తానే తెచ్చుకొనెను.

---

## 11. EGYPTIAN IMPRUDENCE

## ఈజిప్టు అవివేకము

ఈజిప్టుదేశము ఆఫ్రికాఖండముయొక్క ఉత్తరభాగమునను మధ్య-ధరాసముద్రమున కాగ్నేయభాగమునను నున్నది. దీని వైశా-ల్యము మూఁడులక్షల అరువదిమూఁడువేల యిన్నూరు (363,200) చదరపు మైళ్లు. ఇందొకకోటియుఁబదమూఁడులక్షల (113,0,000) జనులు వాసము చేయుచున్నారు. ఇందనేకులు మహమ్మదీయులు. దీనికి కెయిరో ప్రధాన పట్టణము. దీని నేలు రాజు ఖేడివ్ అను బిరుదు గలిగి యుండును. ఈరాజ్య-మును అబాస్‌హిల్మి బాషాయను నతఁడు ఖేడివ్ బిరుదముతోఁ బాలించు-చుండెను. ఈయన 1874 వ-సం॥ జూలై నెల 16 తేదిని జన్మించి తన పదు-నెనిమిదవ యేట 1893 వ-సం॥ జనవరి 7 తేదిని రాజ్యభారమును వహింపఁ బూనెను.

ఈరాజ్యము స్వేచ్ఛగాఁబాలింపఁ బడునదియైనను, తుర్కీరాజ్యమునకు లోఁబడినది. ఇయ్యది ఆంగ్లేయుల పైవిచారణకు లోఁబడి యున్నందున నిందలి జనుల కనేక సౌకర్యములు గలిగి యున్నయవి. దేశమును సుభిక్ష-ముగానే యున్నది. ఐరోపాఖండమున యుద్ధ మారంభ మయిన వెంటనే, తుర్కీ సుల్తానును జెర్మని చక్రవర్తియును గలసి యీరాజు నాంగ్లేయులకు విరోధముగా నిలిచి తమతోఁ జేర నిర్బంధించిరి. వాఁడును వారి యిష్టము ననుసరించెను.

[illegible] రాజ్యములోని జను [illegible] టచ్చుట సఫలం [illegible] యాంగ్లేయ [illegible] ధనమును గూర్చి [illegible] యుండను గూర్చుచున్నారు.

అబాస్ హిల్మీపాచ్ఛా యనువాఁడు జెర్మనివారితోఁ జేరెను. ఐన-ప్పటికిని, ఆ దేశపు మంత్రులును బ్రజలును దా మెప్పటివలెనే యాంగ్లేయుల యేలుబడియందే యిష్టము గలవారై యుండుటవలనను, ఇంతకుఁ బూర్వమే కేడీవు తనదేశమును అందలి ప్రజలను ఈ యుద్ధ సమయమునఁ గాపాడ-వలయు నని ప్రార్థించియుండుట వలనను, మన చక్రవర్తి తామే ముందు నిలిచి యింతకుఁ బూర్వము చేసి యుండిన వాగ్దానము ననుసరించి యారా-జ్యమును రక్షింపఁ గంకణము గట్టికొని, దానిం దమ శత్రుపక్షావలంబియు కృతఘ్నుఁడు నగు తుర్కీ సుల్తానుని యధీనమునుండి తొలఁగించి ప్రస్తుత-మున దమ పగవారిం గలసిన అబాస్ హిల్మిని నైతము పదభ్రష్టుం గావించిరి. మన దొరతనమువారు వాని స్థానమునఁ బూర్వపు రాజవంశీయుఁడైన "హుసేన్ కేమల్" అను రాజకుమారుని రప్పించి సుల్తా నను బిరుదుతో నీజిప్టు దేశమునకు రాజునుజేసి యనేక సేనలు గొలువఁగా మహావైభవముతో కైయరో నగరమున నతనిని సింహాసనాసీనుం జేసిరి.

---

## 12. GERMAN ATROCITIES

## జెర్మనివారి క్రౌర్యములు

అక్రమముగా యుద్ధమునకుఁ బ్రారంభించిన జెర్మనివారి కిప్పుడు చేత నున్న ధనమును ఆహారపదార్థములును నానాటికి తగ్గుచున్నవి. వీరు బెల్జియములోని పెద్ద సివిల్ ఉద్యోగస్థులను ధనవంతులను బట్టి తమ దేశమునకుఁ గొనిపోయి వారిచేఁ బండియుండిన పయిరును గోయించి మహా-సూలు చేయించిరి. బ్రుస్సెల్సు పట్టణములోని రొట్టెలమ్ము వారి యొద్దనుండి దినమొకటికి 70,000 పౌనుల రొట్టెలను నిర్బంధించి తీసికొనిరి. దాని సమీపమున నున్న యొక చిన్న గ్రామమున దినమొకటికి నన్నూరుబుడ్ల మేలైన సారాయిని 40,000 పౌనుల మాంసమును నిష్కనిహింసించితీసికొనిరి.

బ్రుస్సెల్సులోని ప్రజలవలన యుద్ధపు ఖర్చులకై 12 కోట్ల రూపాయలు వసూలుచేయఁ గాపుల నిర్బంధించు చుండఁగా నా పట్టణములోని వర్తకులు నలువురు పైమొత్తము నిచ్చుట కొప్పుకొని యితర జనుల నుపద్రవవిముక్తులం జేసిరి. లీజ్ పట్టణమున మూఁడుకోట్ల రూపాయలు వసూలు చేసిరి. ఆంట్వెర్ప్ నగరపుఁ బ్రజలయొద్ద మూఁడుకోట్ల రూపాయలఁ గొల్లపెట్టుటయే గాక నా యూరిలోఁ గొన్నిభాగములఁ బడకొల్పిరి. ఈ విధముగా నింకను ననేక గ్రామములనుండి యాహారవస్తువులును రొక్కమును మిక్కుటముగ రాఁబట్టిరి.

అనేక సంవత్సరములనుండి యీ లోకమునంగల యపూర్వ విచిత్ర వస్తువులచే నింపఁబడినదియు, అచ్చొత్తని యపూర్వగ్రంథ కోటులచే నిండినదియు, అనేక కోట్ల పౌనుల వెలగల ముద్రిత గ్రంథములను గలదియు, చిత్ర విచిత్ర శిల్ప కల్పనలం గల యనేక ప్రతిమలు గలదియు నైన లోవేన్ నగరమునందలి పుస్తక భాండాగారమును నిష్కారణముగా గాల్చి రూపుమాపిరి. అనేక కోట్ల పౌనులు వెచ్చించి మిక్కిలి యద్భుతముగను ఉన్నతముగను గట్టఁబడినదియు యందఱిచేతను గొప్పగ సన్మానింపఁబడినదియు నై చూపరుల మానసముల కింపు సంపాదించుచువచ్చిన ప్రాన్సుదేశపు రెహీం దేవాలయమును బగులఁగొట్టిరి.

వీరు కాలుపెట్టిన గ్రామములందెల్ల కాపులయిండ్లలోఁ దూరి వారల ధనమును ఆహారవస్తువులను ఆపహరించుటయే గాక, కుసుమకోమలు లగు యువతులను పట్టి కొట్టి మానభంగము గావించి, కొంపలను గొఱివిపెట్టి యవి మండుచుండఁగా తాము పట్టిన పడుచులఁ బ్రాణములతో నామంటలం బడవైచిరి.

కొన్నిచోట్ల నాయూరివారిని జూచినమాత్రాన వారలం దఱుముచుఁ బోయి తుపాకులతోఁ గాల్చియు, గొందఱి నీటెలతోఁ బొడిచియు, కొందఱిని చెవులు గోసియు, కొందఱి చేతులు కాళ్లు విఱిచియు, కొందఱిని తల క్రిందుగా చెట్లకు వ్రేలఁ గట్టి యడుగున మంటలు వేసియుఁ జిత్రవధచేసిరి. ఈలాటి హింసలకుఁ దాళఁ జాలక వారువారు గోడుగోడున నేడ్చుచుండ నట్టివారి కెదుట నిలిచి వీరు చంకలు దట్టుకొనుచు నవ్వుచు ద్రుళ్లుచు సంతోషించిరి.

మఱియును నీ జెర్మనివారు పఱచు పాట్లను దప్పించుకొనం దలంచి యిండ్లలోం దాంగి యుండు స్త్రీబాల వృద్ధుల వెదకి వెదకి కాల్చి చంపుట యును, కాళ్లు కట్టి గిరగిరం ద్రిప్పి గోడలకు మోదుటయును, ఏ యింట నైన జను లనేకులు దాగి యున్నచో నాయింటికి నిప్పంటించుటయును, యుద్ధమున గాయము దగిలినవారి ననేకులం జంపుటయును, కొండఱిచేం బల్లములం ద్రవ్వించి యెవరుత్రవ్విన పల్లమున వారినే తుపాకులతోం గాల్చి పూడ్చుటయును, తల్లి చూచుచుండంగా బిడ్డలను మంటలం బడం ద్రోయు-టయును, భర్తలయెదుట భార్యల మానములం గొల్లబెట్టి చంపుటయును, దేవళములం బడం గొట్టుటయును, పంటపొలములం బాడుచేయుటయును నాదిగా ననేక దుష్కార్యములం జేసిరి.

ఈలాటి దుష్కృత్యములవలన నీదేశమువారు లోకులందఱును దమ్ముం జూచి యసహ్య పడునట్లు చేసికొనిరి. ఆంగ్లేయ యుద్ధమంత్రి కిచ్నర్ ప్రభువు ఇంగ్లండునుండి ఫ్రాన్సుకు సేనలను సంపు నపుడు బోధించిన హి-తోక్తులను సువర్ణమయ శిలయందు శాసనముగా వ్రాసియుంచం దగినదియే యగును: "మీరలు యుద్ధమున కేగు స్థలములలో నమితముగా పానముచేసి చిత్తస్వాధీనములేక హద్దుమీరి నడువకుండు. స్త్రీబాల వృద్ధుల విషయమున మిక్కిలి మర్యాదతోడను ప్రేమతోడను ప్రవర్తింపుండు. మేరమీరి చరింతు రేని దేశమునకు గౌరవహాని గలిగించుటేగాక, మీరును హానిం జెందుదురు" అని గదా యుపదేశించిరి ? ఔరా! మీ రాంగ్లేయ వీరుల కొసర్చిన హిత-బోధకును, జర్మనివారి నడతలకును గల తారతమ్య మెట్టిదో చదువరులే యాలోచింతురుగాక.

---

## 13. BELGIAN BRAVERY

## బెల్జియనుల ధైర్యము

అల్ప సైన్యముల గలవాండైన బెల్జియ దేశాధీశుండు మొదట నుండియు జర్మని చక్రవర్తి నెదిరించి తన ధైర్యమును బ్రకటించి, జర్మని వారి సేనా సముద్రమునకుం జెలియలి కట్టయై నిలిచెను. లెగ్గోంటి అను పట్టణమున 4,000 సైన్యముతో 20,000 జర్మనియనుల నెదిరించి ఘోర

యుద్ధము చేసెను. సముద్రతీరపు కలుజులను బెఱికి యాజలమును భూమిపైఁ ప్రవహింపఁజేసి యనేకుల శత్రువుల నా మున్నీటి ముప్పున ముంచెను.

ఈ దేశమువారు లీజ్ పట్టణమును పగతురు ముట్టడించినపుడు చేసిన యుద్ధము తీరును, బ్రుస్సెల్స్ యుద్ధమునఁ జూపిన సామర్థ్యమును సాటిలేనివి. ఆలాస్ట్ అనుచోట వీరికిఁ గలిగిన జయము సర్వజన సంస్తవనీయమైనది. ఆంట్వెర్పు నగరమున జరిగిన యుద్ధము తీరును అందు జర్మనియనులకుఁ గలిగించిన నష్టమును కష్టమును జెప్ప నలవి గానివి.

జర్మని వారొక బెల్జియం దేశపు ధనికుని బట్టి నిష్కారణముగఁ గంబమునకుఁ గట్టి తుపాకితో వాని తలఁ బగులగొట్టఁ బోవు సమయమున నతని కూఁతురు 19 ఏండ్ల చిన్నది పరుగున వచ్చి వానిచేతి తుపాకిని బెఱికి వానిని వాని సేనానాయకుని తక్కుంగల జర్మని యుద్యోగస్థులను పలువుర యుద్ధవీరులను గాల్చి యొకక్షణమున చంపి తనతండ్రిని విడిపించుకొని పోయినది.

జెర్మని సేనానాయకుఁ డొకఁడు బెల్జియము దేశమునం బ్రవేశించి యనేకులను జంపి యా పీనుఁగులఁ బ్రోవు గావించి తా నా ప్రోవు నడుమ నిలిచి యాదేశపుఁ జక్కని నగరముల వివరణమును దెలుపు నొక పెద్ద దేశపటమును విప్పి చూచుచుండెను. అతని చుట్టును గొంతదూరమున మండలాకారముగా వాని సేనలు వాని రక్షణకై కాచియుండెను. ఆ సమయమున వాఁడు నిలిచియున్న చోటికి సుమారు 900 గజముల దూరమున ప్రేతరాశి నడుమ 18 ఏండ్ల యీడుగల హాయిల్స్ అనునొక బెల్జియ బాలకుడు దాఁగియుండెను. వాఁడా సేనానాయకుఁ డొంటిమైయి నిలిచి పటమును జూచుచుండుటను గాంచి యొక విధముగ నాలోచించి యద్దాని నెరవేర్పఁ గ్రిందపడి యున్నట్లే మెల్లమెల్లగ నాపీనుఁగుల నడుమనే ప్రాకుచు సేనానాయకుఁ డుండుచోటికి సుమారు నన్నూరు గజముల దూరమునఁ దలయెత్తి నిలిచి, తనయొద్దనున్న చేతుపాకితోఁ గాల్చి వానిం జంపెను. వాని చుట్టునుండిన సేన లీ చిన్నవాని కృత్యము నెఱుఁగుటకుఁ బూర్వమే యా సేనానాయకుని యుడుపులను గిరీటమును దాల్చి వాని గుఱ్ఱము నెక్కి మహావేగముతో నా సేనామధ్యమునఁ బ్రవేశించెను.

వాఁడచటఁ గొన్ని సేనా రహస్యముల నుపాయముచే నెఱింగి బహు సాహసముతో తప్పించుకొని తన దేశపు సేనల సమీపమునకుఁ బోయి తాఁ దాల్చియుండిన పగతుని యుడుపులను దీసి కిరీటమును చేఁబూని వాని నెల్లఁ దనదేశపురాజు చేతికిచ్చి తనకుఁ దెలిసి యున్న శత్రుసేనా రహస్యమును విన్నవించెను.

ఆ సేనానాయకుఁడు ఆ చిన్నవాని ధైర్య సాహసములను బుద్ధిబలమును మెచ్చుకొని వాని కాయుద్ధరంగముననే యెల్ల రెఱుంగ 'సర్' అనుబిరుదు నిచ్చి వాఁడెక్కి వచ్చిన గుఱ్ఱమును, పైఁజెప్పిన సేనానాయకుని యుడుపుల లోని సంచియందుండిన బంగారు గడియారమును, స్వీయ ధనమును వానికే బహుమానముగా నిచ్చుటయేగాక, ఆ సేనా నాయకుని యొద్ద జెర్మనిసేనలకుఁ గావలసిన సెలవుల నిమిత్తము ఉడుపునఁ దాఁచియుంచిన యెనుబది యొక వేల రూపాయలను గాయము తగిలిన తనసైనికుల చికిత్స సెలవుల నిమిత్తమై యొసంగెను: అందఱు నెఱుంగ నా చిన్నవాని ధైర్యమును విశేషముగఁ గొనియాడెను.

ఈ విధముగా జర్మనివారి సేన లీదేశమున బలువిధముల నష్టములకుఁ బాల్పడవలసి వచ్చెను. ఈదేశమున అబలా బాలక సమూహము గూడ శౌర్య సాహస సమేతమై యున్నదనుట యెంతయుఁ బ్రశంసనీయము.

ఈ మహాసంగ్రామమున బెల్జియమువారు ప్రకటించుచుండు ధైర్యాగ్ని క్షణమాత్రము సకల దేశముల నల్లుకొనియెను.

జెర్మనివారు లీజ్ కోటలను బట్టునప్పు డా సేనల కధికారియైన లీప్ అను రాజకుమారుఁడును వాని యల్లుఁడును ప్రుసల్లి కోటను ముట్టడించిరి. దాని చుట్టుప్రక్కలనుండు కొన్ని స్థలములను శోధింపఁ దలఁచి యా యిరువురును నొకనాటి రాత్రి గూఢముగాఁ బాదచారులై పోయిరి. ఆ సమయమున బెల్జియదేశపు పిల్లఁడొక డా యిరువురను వచ్చుచుండుటను జూచి శత్రుపక్షమువారగుట యెఱింగి, వారు వచ్చు మార్గముననే యొక పల్లమునఁ దాగియుండి యాశత్రువులు దన్ను సమీపింపఁగనే తుపాకితో వారిం గాల్చి యా సమాచారమును దన సేనాపతి కెఱింగించెను.

ఈ సమాచారమును విన్న సేనానాయకుఁడును నా పిల్లని వేవిధములఁ బొగడి యా పిల్లఁడుండు చోటికిఁ బోయి యా క్షేత్రస్వాయమును

సేరెయింగ్ అను చోటునకుఁ దెచ్చి శోధించి చూడఁగా, ఆ రాజకుమారుని టోపియందు ననేకములయిన నోట్లును, వాని చేతనున్న కత్తి పిడియందును నడుమునఁ గట్టియున్న బంగారు కాసెయందును ననేక పౌనులు వెల గలిగిన యపూర్వరత్నములును బొదువఁబడి యుండెను. అతఁడా ద్రవ్యమును దమ రాజునొద్ది కంపఁగా, మహోదార స్వభావముగల యా బెల్జియ దేశాధీశుఁడు దనకు జయలబ్ధమైన యా ధనమును దన శత్రువైన జెర్మని చక్రవర్తికే యంపివేసెను. ఇట్టి యౌదార్యము స్త్రీబాల వృద్ధులను సైతము కరుణాహీనుఁడై చంపుచున్న కటికవాఁడగు జెర్మని చక్రవర్తికి వేయిజన్మములు తపసు చేసినను గలుగునా?

---

## 14. RUSSIAN HEROISM

## ఋష్యనుల పరాక్రమము

అనేకాశ్వికసేనా పరంపరలు గల ఋషియనులు ఈ యుద్ధమారంభమైనది మొదలు ఆస్ట్రియా జెర్మని దేశములపైఁ జూపుచుండు పరాక్రమము ఇంతంత యని చెప్ప నలవికాదు. వీరనేక లక్షల సేనలతో ఆస్ట్రియా నెదిరింప నది యీసేనల ధాటి కోర్వఁజాలక తత్తరపడు చుండ, జెర్మనివారొక గొప్పసేనతో నచ్చోటికిఁ బోయి ఋషియనులచేఁ బరాజితు లగుటయును, ఆ సమయమున ఫ్రాన్సున నున్న వీరి సేనలు సడలి యాంగ్లేయులచేఁ దఱుమఁ బడుటయును జూచినవా రెల్ల మెచ్చుకొను చున్నారు.

ఋషియనులు ఆస్ట్రియా రాజ్యపుఁ బూర్వ భాగములోని కొలది భాగము నాక్రమించుకొనిరి. ఋషియదేశపుఁ బ్రజలలో నింకను నొకకోటి సంఖ్యగల యుద్ధవీరులు తయారు జేయఁబడుచున్నారు: వీరు సంవత్సరములు ఎన్నియైనను జెర్మనివారిని ఆస్ట్రియనులను తలయెత్తనీయక ధ్వంసము సేయఁ దీర్మానించుకొని యున్నారు. వీరి దేశమో మహా విశాలము: జన సంఖ్య యన్ననో యత్యధికము: ధనమో తఱుగనిది: పరాక్రమమో ప్రశంసనీయము

ఈచక్రవర్తి తన రాజధానియగు సెంట్ పీటర్స్‌బర్గ్ జెర్మని నగర

మువలె నగపడు చుండుటం జేసి, (బర్గ్ అనునది జెర్మనిలోని గ్రామముల కుండు పేరు) జెర్మనివారి క్రూర కృత్యములం గాంచి లోకమెల్ల నసూయం జెందియుండుటవలన, తమదేశపుం బ్రజల యభిప్రాయము ననుసరించి యా నగర నామమును 'పీట్రోగ్రాడ్' అని మార్చికొనిరి.

గుఱ్ఱపు సవారిచేయుటలో మిక్కిలి నేర్పరియైన ఋష్యావీరుఁడొకఁడు జెర్మనివారికినిదమకును ఘోరయుద్ధము జరుగుచుండు సమయమునఁ దానెక్కియుండు నశ్వము శత్రు సేనాధిపతిచేఁ గొట్టఁబడినది. ఇట్లు కొట్టఁబడిన గుఱ్ఱము నేల కొఱఁగునంతలో నా ఋష్యాదేశీయుఁడు నేలకు లంఘింపఁగా, వానిని శత్రుసైన్యాధ్యక్షుఁడు దనచేతి కరవాలముతో నఱుకఁబోయెను. ఇంతలో నాయాశ్విక భటుఁడా శత్రువుని గుఱ్ఱముయొక్క కడుపు క్రిందుగా దూరి వెనుకటి పార్శ్వమును జేరి తటాలున దానిపై కెక్కి యా సేనానాయకుని చెవిలోఁ గర్జించెను. ఆ గర్జారవమున దిగ్భ్రమఁజెందిన సేనాపతి తనచేతి కత్తిని జారవిడుచుటయు నదియ సమయమని యా ఋష్యావాఁడాతని పెడ రెక్కలు విఱిచికట్టి యాగుఱ్ఱపు వాఁగెలఁ దనచేతఁబట్టి శరవేగమున నాగుఱ్ఱమును దమసేనలోనికి బఱపి యతనిఁ దమసేనానాయకున కప్పగించెను. ఇట్లు శత్రువులకుఁ జిక్కియు నాజెర్మని సేనానాయకుఁడు తన్ను బట్టిన వీరుని ధైర్య సాహస బుద్ధి కౌశలములను వేనోళ్లఁ బొగడెను.

ఈ యుద్ధమున నింతవఱకు నపజయమన నెట్టిదో యెఱుగని యొక ఋషియా వీరుఁడు తన సేనలతో జలపూర్ణమైన యొక చెఱువుకట్ట వెంబడి వచ్చుచుండగా, జెర్మనివా రనేక సైన్యములతో నెదురుపడి, వానిని వాని సేనలతో గూడ మూఁడు ప్రక్కలను ముట్టడించిరి. అంత నా ఋషియ సేనాధిపతి తన్నుఁ బొదివిన జెర్మనియనులు తన సేనలకన్నఁ బదిమడుఁగులు హెచ్చుగా నుండుటంగాంచి వారిచేఁ జిక్కి యవమానము నొందుటకన్నఁ జచ్చుటయే మేలని తన సేనలను ఆయుధాది సర్వవిధ సామగ్రులతోడ నా చెఱువునఁ బడమని తానును వారితోడఁ బ్రాణత్యాగము చేసెను.

దీనిం గాంచిన జెర్మనియనులు వాని సాహసమునకును మానరక్షణ బుద్ధికిని మెచ్చుకొనిరి. "ప్రాణంవాపి పరిత్యజ్య మానమేవాభిరక్షతు" అను వచనము ఈ వీరునియందు సార్థకమైనది. ఇంతటి మనస్థైర్యముగల

వీరులు ఋషియ సైన్యమున ననేకులు గలరు. వీనిం బోలుదురే యితర దేశపు సేనా నాయకులు !

---

## 15. FRENCH STRATAGEM

## ఫ్రెంచివారి తంత్రము

పదాతిసేనలకుఁ బ్రసిద్ధిఁగాంచిన ప్రాన్సుదేశపు నెల్లలోఁ జెర్మనివారు బ్రవేశింపఁగానే, ఫ్రాన్స్ గవర్నమెంటువారు కొన్ని సైనిక తంత్రముల ననుసరించి తమ ప్రధానపట్టణమగు పారిసును ఖాళీచేసి బోర్డో యను నగరమును దత్కాలమున రాజధానిగాఁ జేసికొని యున్నారు. వీరు శత్రువులు తమదేశములోఁ బ్రవేశింపకుండు నట్లు ఆటంకము చేసి యుద్ధము చేయుచువచ్చుట మిక్కిలి యద్భుతము. శత్రువుల కనేక స్థలములందు నష్టము విశేషముగాఁ గలిగించిరి: వారలను తంత్రముగా మాయలకు లోఁబఱచి మడియించుచున్నారు.

జెర్మానియనులు పారిసుకోటలను బట్టుటకై యందులకు మూఁడుమైళ్ల దూరమువఱకు సమీపమునకువచ్చి లోపలఁ బ్రవేశింపఁ దలఁచియుండఁగా ఫ్రెంచివారిచే మార్కొనబడి యిరువదిమైళ్లు వెనుకకుఁ బాఱిపోయిరి. వీరు ప్రాన్సుయొక్క యంతర్భాగమునఁ బ్రవేశింపఁ దలఁచినపుడు, వీరి గొప్ప సైన్యము భూమియందు లోతుగాఁ ద్రవ్వఁబడి నీరు నిండిన యగడ్తలు తంత్రముగా పైతట్టు చెట్లుచేమలచేఁ గప్పఁబడి యుండుట యెఱుంగక భూభాగమే యని తలంచి యందుపై నడువఁగా నందఱు నాయగడ్తలంబడి యమపదమున కేగిరి.

ఏఁబదుగురు యుద్ధవీరులను గల యొక ప్రాన్సువీరుఁడు దూరమున నిలిచియుండు శత్రువులకు ఏనూరు సేనలతోఁ బోవునట్లు తన సేనలను ద్రిప్పి త్రిప్పి మఱల్చిచూపి యొకరాత్రియంతయు నొకగొప్ప జెర్మనిసేనను ఒక యడవికిఁ బశ్చిమభాగమున నిలుచునట్లు చేసెను. శత్రువులదగు ననేకవేల గుండ్లు ఆరాత్రియంతయు నా యడవిలోని పొదరిండ్లను గాల్చినవే గాని, ఉపాయశాలియగు నావీరుని సేనలోని 37 గురికిపై చంపినవి కావు. మరునాటి

సూర్యోదయమునకుఁ బూర్వమే యాతంత్రశాలి తనతోడ మిగిలిన బదుముగ్గురు సైనికులను వెంటఁబెట్టుకొనిపోయి తన ప్రధాన సైన్యమునఁ గలసెను. ఇది యెఱింగి జెర్మనీయులు లజ్జనొందిరి.

ఇరు దెగల వారికిని పోరు ఉగ్రముగా జరుగుచున్నపుడు ఒకనాటి సాయంకాలమున ఫ్రెంచివారు ఒక యున్నతమగు మట్టిదిబ్బపై నొకటివెనుక నొకటిగా ననేకవేల గుంజలను నాటి, వాటికి ఉడుపులు దొడిగి టోపీల నమర్చిరి. దూరమున నున్న జెర్మనివారిది యొక సేన యని తలఁచి యనేక పిరంగులను వానితట్టున కమర్చి గుండ్లవాన కురిపించిరి. ఇట్లొక రాత్రియంతయు శత్రువులగుండ్లను అనేకటన్నుల తూకముగల మందును పాడు చేయించి మఱియొక తట్టుగా శత్రువులపైఁబడి చెల్లాచెదరు గావించిరి.

వీరి యాశ్వికసేనానాయకుఁ డొకనాటి యర్ధరాత్ర సమయమున లార్క్ అను నడవికి సమీపముగా వచ్చుచుండు శత్రువుల బల మింతయని కనుగొనుటకై రహస్యముగా దన సేనలోని పన్నిద్దఱువీరుల నొకసార్జెంటు తోడనంపెను. ఈ పదుముగ్గురిలో నొకభటుఁడు తక్కిన వారికన్న ముందు గాఁబోయి యొకచోట గూఢముగానుండి యా మార్గమున నడిచి వచ్చు చుండు శత్రువులను లెక్కించి యతి శీఘ్రముగావచ్చి యా సంగతిని దన యజమానుఁడగు సార్జెంటునకు నివేదించెను. వెంటనే మహాబుద్ధిమంతుఁడగు నా సార్జెంటును దనవారితోడ నామార్గము వెంబడిని జెట్లతోఁ గప్పఁబడి యుండు నొక పాడుపడిన యింటిని చేరి తమ గుఱ్ఱముల నాయింటి వెనుక తట్టుగాఁ దాచి తాను దనవారు నాయింటఁజొచ్చి తలుపులు మూసికొని మిద్దెపైనెక్కి చూచుచుండిరి. తరువాతఁ గొంతసేపటికి తమవారినుండి కొలి ముందుగా గుఱ్ఱములనెక్కి నవ్వుచును త్రాగుచును వేడుకగా మాటలాడుచు వచ్చుచుండిన డెబ్బదుగురు శత్రువీరులు దామున్నగృహ సమీపమార్గమున బోవుచుండఁగా నావేడపై దాగి యుండిన యీ పదుముగ్గురును వారిపై నగ్నివర్షము గురియించిరి. ఇట్టి యుత్పాతమువచ్చునని యెఱుఁగని యా జెర్మనివారు గుండ్లెట్టునుండి వచ్చుటయు నెఱుఁగఁ జాలక దిగ్భ్రమఁ జెంది యందే నిలిచియుండిరి.

అంతట నా ఫ్రెంచి సార్జెంటు తనతోడివారిలో నార్గురిని బిలిచి వారితోఁ గొన్ని విషయములను జెప్పియంపి తక్కినవారును దానునుఁ బూర్వ

రీతిని దుపాకులఁ బరగింప సాగిరి. ఇంతలో జెర్మని వీరులును జీఁకటిలో దమమీఁదికి గుండ్లు వచ్చుచుండు నింటిలొట్టు దామును గాల్ప మొదలుపెట్టిరి. వెంటనే యా మేడనుండి దిగిన యార్గురును ఆ యింటనున్న సామానుల నొకటితో నొకటి మోది గొప్ప కలకలమును గలిగించి వారిలో నొకఁడు "యుద్ధమునకు సన్నద్ధులగుఁడు" అను సంజ్ఞను దెలుపు నొక బాకాను పలు తడవలు గట్టిగా నూదెను.

ఆ ధ్వని విన్న జెర్మనివాండ్రు చీఁకటి యగుటచేత నాయింటికి వెనుక నెంతయో గొప్పదగు శత్రుసేన యున్నదని బెదరి యా సార్జెంటును సేనాపతియేయని తలఁచి వాని యొద్దకేగి తమ యాయుధముల నెల్ల నతనికొప్పగించి సమాధానముగా నిలిచిరి. అంతనా సార్జెంటు వారి నారాత్రియంతయు నా యింట ఖైదీలుగానుంచి మరునాటి యుదయమున దనతోనుండిన పన్నిద్దఱు వీరులును దానునుజేరి యీ డెబ్బదుగురు శత్రువీరులను గొనిపోయి తమ సేనానాయకుని కొప్పగించెను. ఆ సేనానాయకుఁడును దన సార్జెంటు యొక్క ధైర్యసాహస తంత్రములను జాల మెచ్చుకొని వానిని విశేషముగాఁ గొనియాడెను.

మఱియొక దినము సాయంకాల సమయమున నొక పెద్ద సేనతో ఫ్రాన్సు సేనానాయకుఁ డొకఁడు శత్రువులకు గోచరమగునట్లు వారికి సమీప ప్రదేశమున నుండు నొక యరణ్యమునఁ బ్రవేశించి మహా నైపుణ్యముతో నా యడవిలోని మఱియొక దారిని వారికిం దెలియక దనయునికిని జేరెను. ఈ మాయ నెఱుంగక యచట దమ సేనలతో విడిసి యుండిన విల్లియం రాజకుమారుఁడు ఆ యడవిని జొచ్చిన శత్రు నచటనే దాఁగి యున్నాఁడని యెంచి వానిని నాశముచేయఁ దలఁచి చీఁకటిలో నాయడివివెంబడి నిలిచి యున్న తన సైన్యమును శత్రువులని తలఁచి వాని నారాత్రియే రూపు మాపెను: మఱునాఁడు సూర్యోదయమగుటయుఁ దన ప్రమాదము నెఱింగి చింతాక్రాంతుఁడై తమ చక్రవర్తి కోపమునకు జడిసి ప్రాణ్నడిచెను.

ఈ తీరున నీగొప్ప యుద్ధమున దినమొకవిధమగు తంత్రము లనేకములు జరుగుచున్నయవి. వీని రహస్యములను అన్యదేశీయు లగు జెర్మనివారు తెలిసికొనఁజాలక హేరాళములైన తమ సేనలను దామే ధ్వంసముచేసి కొనుచున్నారు.

## 16. ENGLISH SUPERIORITY

### ఆంగ్లేయుల శ్రేష్ఠత

మన యాంగ్లేయులు చేయుచుండు యుద్ధమున ఆరంభము నుండియు వారు చూపుచు వచ్చిన సామర్థ్యమును యుక్తియును సర్వజన స్తవనీయమై యున్నవి. సముద్ర సేనా యుద్ధమున వీరే సాటిలేనివారు. వీరితో నెగరించి నిలుచువా రెవరును లేరు. ఈ యుద్ధమున ననేక స్థలముల వీరు చూపు నేర్పు వలన నెదటివారి సేనకు విశేష నష్టము గలుగుచున్నది వీరు మెఱక యుద్ధమునను బ్రఖ్యాతి వడసిరి.

పారిసు నగరోత్తర భాగమున 33 మైళ్ల దూరమున నున్న యొక మహారణ్యమున నాంగ్లేయ సేన యొక గొప్ప జెర్మని సేనను దాకెను. జెర్మని వారా యరణ్యమార్గముగా యెమియన్ నగరమున కేగ యత్నింపఁగా, రెండు దినముల వఱకును శత్రువుల నడ్డగించి రాత్రిందివములు వారి సేనలను బాధచేసిన సమయమున శత్రువులు ఇంగ్లీషువారి యాశ్వికుల శ్రేష్ఠతయును పదాతుల పరాక్రమమును సహింపఁ జాలక తమసేనలలో ననేకుల బాధ చేసికొని యానాటి యాంగ్లేయుల ధీరత్వమును వేనోళ్ల గొనియాడిరి.

మనవారు మాన్స్ పార్లీరాయ్ కేంబ్రియా టోర్నే అను ప్రదేశముల నడచిన యుద్ధములలో జూపిన శౌర్యమును, కోంపేన్ యుద్ధము యొక్క వీరత్వమును, మార్నె యుద్ధమున పగతురను మట్టుపెట్టిన రీతియును, ఆలాన్స్‌టిట్ ఫ్లాండర్స్ యుద్ధముల యుగ్రమును, ఎయిసీ న్యూపోర్టు యుద్ధముల శత్రువులకుఁ గలిగించిన నష్టమును జూడ, మన యాంగ్లేయ సేనల శౌర్య ధైర్య పరాక్రమ సేనా విన్యాస చాతుర్యాదుల శ్రేష్ఠతను అమెరికా ఋషియా ప్రభృతిదేశీయు లత్యంతము గొనియాడుచున్నారు.

ఇమ్మహా సంగ్రామము జరుగుచుండఁగా నొకనాడు ఫ్రెంచివారి సేన యొక పల్లపుఁ బ్రదేశమునఁ జిక్కెను. వారా తరుణమున నా పల్లమును దాఁటి యుందు రేని, పగతురకుఁ జిక్కి ప్రాణములఁ గోల్పోయి యుందు రనుట తప్పదు. అదియెఱిఁగి ఫ్రెంచివారి సర్వసేనానాయకుఁ డెట్లయినను దన సేనలకు నెచ్చరిక చేయుటకై మఱికొంత సేనలతోడ బయలుదేరఁగా, జెర్మ-

నులు వారిని నిరోధించిరి. అందుల కెదటిపార్శ్వముననున్న యొక తోఁపులోఁ దాఁగి యుండిన యాంగ్లేయసేన లాపనికి యత్నించుచుఁడు నా సైన్యమునుండి యొక వీరుఁడు బైసికిలునెక్కి వారి కెచ్చరిక సేయ మహావేగముతో బయలు దేరెను. మార్గమున శత్రువులు వానిం జంపిరి: వెంటనే రెండవ వాఁ డొకఁడు బయలుదేరఁగా వానిని సైతము గడతేర్చిరి. ఈ యిరువురకు నీగతి సంభవించినను మూఁడవ వాఁ డొకఁడు అదే విధ మగు బండినెక్కి శత్రు-వులకుఁ జిక్కక యాబండి చేతిపిడుల నడుమ తలఁ దాచుకొని శరవేగ-మునఁ బోయి యాసేనల కెచ్చరిక చేసెను. దీనింగాంచిన ఫ్రెంచివారి సేనా-పతి యా శూరాగ్రేసరు నాలింగనముచేసికొని చేతిని చేతితోఁ దెమల్చి, తన యొద్దనున్న యొక గొప్ప పతక మతని యక్కున జొక్కామీఁదఁ జెక్కి, "అయ్యా! నేనొకప్పు డొక్క ప్రాణిని రక్షించి యీపతకమును బడసితిని; ఇప్పుడనేక ప్రాణులరక్షించిన నీకీ పతకమిచ్చుటయే గాక యనేక వందనము లర్పింతును. నీ కృత్య మాంగ్లేయుల శ్రేష్ఠత్వమును దెలుపుటకు జయ-స్తంభ మగుఁగాక!" అని యిట్లనేక విధముల నా వీరుని గొనియాడెను.

ఒకనాటి మధ్యాహ్న సమయమున నాంగ్లేయ సేనలపై జెర్మనివా రనేకములగు ఫిరంగులతో నగ్నివర్షము గురియింప సాగిరి. ఆ సమయమున నాంగ్లేయ సేన గుమిగూడి వాన చినుకుల కెదురు పోవు వృషభములవలె నాయగ్ని వర్షమున కభిముఖులై పరుగునఁ బోయి వారి ఫిరంగులను బట్టు-కొని వాటిచేతనే వారిని వసుధాతలము నెడబాపిరి. అట్లు శత్రువుల కెదురు పోవునప్పుడు సగముకన్న నధికులు సమసినను, దక్కినవారు ధైర్యముతో శత్రువుల సమీపించి యింత ఘనకార్యము నెరపుటయే యాంగ్లేయ సేనల శ్రేష్ఠత్వమును నూపించుచున్నది గదా ?

తుపాకితోఁ గురి చూచుటయందు జెర్మనివారికన్న నాంగ్లేయసైని-కులే యధికులు. ఇందుకు దృష్టాంతము లనేకము లీ యుద్ధముననే గాంచ-వచ్చును. ఒకనాఁ డొక జెర్మని వీరుఁ డాకాశ యానము నెక్కి వెడలి యాం-గ్లేయ సేనా మధ్యమున నొక బాంబును బడవేయుటకై యాసేనలకు సూటి-గాఁ దన యానమును బహు వేగముతోఁ బరపుచు వచ్చెను. అది గాంచిన యాంగ్లేయవీరుఁ డా యాకాశ యానమును గుఱిపెట్టి తుపాకితోఁ గాల్చు-టయు నతివేగముతో నాకాశమున నటునిటు దిరుగుచున్న యా యానము

నందున్న వీరుని ఱొమ్మున కా దెబ్బ తగిలి యానము సైతము విఱుగఁగాఁ బట్టిన చక్రము పట్టినట్టే యా వీరుఁడు విమానముతోడఁ గూలెను. ఇట్టి లక్ష్యజ్ఞాన మాంగ్లేయులలో ననేకులకుఁ గలదు. పఱచుచుండు యంత్రములను వాని యందుండు వీరులను గురి తప్పక కొట్టునట్టి దృష్టిలాఘవ మాంగ్లేయుల సొమ్మే యని యందఱు నొప్పుకొనుచున్నారు.

కడచిన సం॥ సెప్టెంబరు నెలలో వెర్నియూ లనుచోట మహాఘోరయుద్ధము జరుగుచుండఁగా హైలాండు పదాతివర్గములోఁ జేరిన జార్జివిల్ససను నొక యాంగ్లేయ వీరుఁడు మఱియొకనిని దనకుఁ దోడుగాఁ గొని శత్రువులు మిక్కిలి జాగరూకులై రక్షించుచుండు నొక యంత్ర ఫిరంగియొద్ది కేగ యత్నించెను. శత్రువులును దమ్ముగూర్చి వచ్చుచుండు నీ యిరువురి మీఁదను దుపాకులను గాల్చిరి. దానివలనఁ దనతోడవచ్చిన వీరుఁడు సచ్చినను, దాను మాత్రము ధైర్యము వదలక యాఫిరంగి నుంచియున్న చోటుఁజేరి యచ్చోట నా ఫిరంగిలోనికి వేగముగా గుండ్లను ద్రోయుచుండిన జెర్మని సైనికుల నార్గురను వారి యధికారితోడ నొక్క నిమిషమునఁ జంపి యా ఫిరంగిని స్వాధీనము చేసికొనెను. ఇంతటి సాహసకృత్య మొనర్చిన యీ వీరుని మన చక్రవర్తి మెచ్చుకొని వీనికి బహుమానముగా 'విక్టోరియాక్రాస్' అను బిరుదు నొసంగిరి.

ఈసేనల కెల్లఁ బ్రధానాధ్యక్షుఁడైన సర్ జాన్ ఫ్రెంచ్ అనునతఁడును అతని సహాయాధ్యక్షులును నీ యుద్ధమున జూపు శౌర్యాదులకు మెచ్చిన మన దొరతనమువారు వీరలకు ననేక గౌరవ బిరుదులు మొదలుగాఁగల బహుమానము లొసంగి కొనియాడుచున్నారు.

---

## 17. INDIAN GALLANTRY

## ఇండియనుల శూరత్వము

మహాఘనత వహించిన మన రాజప్రతినిధియగు హార్డింజ్ ప్రభువు-గారి శిపారసునుబట్టి ఐరోపాకు పంపఁబడిన యిండియా సేనలు ఫ్రాన్సుదేశపు టెల్లను జేరిన వెంటనే యాదేశపువారివలన మిక్కిలి గౌర-వింపఁబడి మిగుల విశ్వాసముతో నడుపఁబడిరి. ఇంగ్లాండంతయు మన యిండి-యా సేనలను గూర్చి మిగులఁ గొనియాడుచున్నారు. ఈ మహాయుద్ధమున వీరు చూపుచుండు ధైర్యమును శౌర్యమును సర్వజనులచేతను విశేషముగాఁ గొనియాడఁబడుచున్నవి. బెల్జియమునందును ఫ్రాన్సునందును జరుగుచుండు ననేక యుద్ధములలో నిండియనులు చేసియుండు అనేకాద్భుత కార్యములను ఆంగ్లేయులును వారి మిత్రమండలమువారును గని మహదాశ్చర్యము నొందియున్నారు. యుద్ధమునందు దెబ్బలు దగిలిన యిండియావీరులకు సహాయ-ముగా నిండియానుండి యంపఁబడు విశేష సహాయములే గాక, ఆంగ్లేయ దేశీయులును ఫ్రాన్సువారును దమతమ దేశములందు వారికిఁ గావలసిన సౌకర్యములను ఏర్పఱచియున్నారు. అలెగ్జాండ్రియా, మల్టా, ఈజిప్టు మొదలగు దేశములనుండి యాస్పత్రులును వారి కొఱకేర్పరుపఁబడియున్నవి.

ఇండియానుండి పోయి యుండు సైనికులలోఁ గొందఱు తూరుపు చైనాదేశమునందుండు సిజ్టోపట్టణము మొదలు పడమట బెల్జియదేశమున నుండు డిక్స్మూడ్ నగరమువఱకును అచ్చటచ్చట తగిన దుర్గములందు నిలుపఁబడి అందందు వారివారి సామర్థ్యములం జూపి మన చక్రవర్తికి జయమును గలిగించునట్టి పలువిధములగు కార్యములను జేయుచున్నారు.

బెల్జియనులు యుద్ధము చేసిన చోటునకు నుత్తరమునఁ గొంతదూర-మునందుండు నొక దట్టమైన యడవినడుమ జెర్మనివారిచే దమ పిరంగులను దాపరికము చేయఁబడి యాచో నెవరికిని దెలియక యుండుటకై యందు-లకు దక్షిణముగా తమ గొప్పసైన్యమును నిలిపిమఱుగుచేసికొని యెదుటి సేనల నెదిరించి విశేష నష్టమును గలిగించుచువచ్చిరి. ఈ చోటును గనుగొనుట యెవరికిని సాధ్యము కాక యుండెను. తుదకు దానిని వైమానికులు బహు ప్రయాసముతోఁ గనిపట్టిరి. ఈస్థలము సముద్రతీరమున కేడు మైళ్లు తూర్పునను,

తత్సమయమున జెర్మనియనులు నిలిచి యుద్ధముచేయుచుండు చోటికి నుత్తరమున మూఁడుమైళ్ల దూరమునను నుండినది. ఆ చోటునకు బోవ నెవరికిని సాధ్యముకానిదై తోఁచెను. దీని నెఱిఁగిన యిండియాసేనకు సంబంధించిన యొక చిన్న గూర్ఖాపటాల మొకనాటిరాత్రి రహస్యముగా బయలుదేరి రెండు యుద్ధనావల నెక్కి వాటి దీపముల నార్పి నిశ్శబ్దముగా సముద్రము మీఁదుగా బయలుదేరి మిక్కిలివేగముగాఁ బోయి ఐసర్ నదీ ముఖద్వారము-నుండి తిన్నగ లోపలఁ బ్రవేశించి, జెర్మనియనులు దాఁచియుంచిన ఫిరం-గులున్న స్థలమునకు ముక్కాలుమైలు దూరమున నిలిచి చూడఁగా, ఆవలి-గట్టు వెంబడిగా నార్గురు జెర్మని యుద్ధవీరులు బహుజాగ్రతగా పారా నిచ్చుచుండుట కానఁబడెను.

అంతట గూర్ఖా సైన్యములోని గొప్పయుద్యోగస్థుఁ డొకఁడు దన యోడల దట్టమైన యొక యడవి మఱుఁగున నొక యోరగా నిలిపి సేనలను గట్టున దింపెను. ఈ వీరు లందఱును తమకుఁ గలుగఁబోవు నాపదలను లక్ష్యము చేయక నేలమీఁదఁ బండుకొని సుమారఱమైలు దూరము దోగా-డుచు నిశ్శబ్దముగాఁ బోయిరి. అప్పుడు వారిలో నార్గురు తమ యాయుధములనెల్ల నితరులచేత నిచ్చి ఒఱపెట్టిన నిడుదలైన కత్తు-లను నోటఁ గఱచికొని ముందుకు జరిగిపోయి, మిక్కిలి జాగ్రతతో సర్వాయుధధరులై పారానిచ్చుచుండిన జెర్మనివీరుల నార్గురిని సమీ-పించి తమ కత్తులతో తలొక జెర్మనునిఁ జక్కాడిరి. అప్పటికి సుమారొం-టిగంటరాత్రి యయ్యెను. రాత్రి యన్నకొకటికి చీఁకటి క్రమ్మి నిశ్శబ్దముగను భయంకరముగను నుండెను. ఇంచుక సందడియయ్యెనా యొంగుండు ఫిరంగు-లన్నియు నొక్కపెట్టున ప్రేలఁగలవు. సమీపమున నుండు సైన్యమును సన్నద్ధమగును. ఈలాటి కష్టము లేవియును గలుగకుండునట్లు లించుకైనను జప్పుడు గలుగనీయక యీ యార్గురు గూర్ఖులును జెర్మనివీరుల నార్గురిని జంపిన వెంటనే, వీరివెంట దోగాడుచు వచ్చిన తక్కినవారు క్షణముననే లేచి నిలిచి యందఱు నొక్కుమ్మడి నాఫిరంగులున్న చోటికిం జని వాటిని నిర్మూలించి మందునంతటిని దగులఁబెట్టి జర్మనిసేనలకు విశేష నష్టమును గల్గించి, తమ కార్యము నెగ్గించుకొని మఱలి యోడల నెక్కి క్షేమముగాఁ దమ స్థానమును జేరిరి. వీరొనరించిన యీసాహసకార్యము మరునాఁ డంద-

తెకిని దెలియఁగనే, జెర్మానియనులు దాఁచియుంచిన తమ పిరంగులతోడ నచ్చోటు విడచి ముందుకు రావలసినవారైరి.

లాబాస్సి యనుచోటికి సమీపమున నొక యగడ్తలోఁ జరిగిన యుద్ధమున మన యాంగ్లేయులు శత్రువులను నుగ్గునూచము గావించుచుండఁగా, జెర్మనియనులు వారిని నెట్టుకొని యచ్చోటిని దాఁటిపోవ నారంభించిరి. ఆ తరుణమున మన యిండియాసైన్యము లాయగడ్తలో దుమికి యాంగ్లేయులకు ముందుగ నిలిచి తమ్ము నెదిరించివచ్చు జెర్మనియనులను దమ తుపాకుల కొనలం దమర్చియుండెడి నీటెలతోఁ బొడువ మొదలుపెట్టిరి. అప్పుడు జెర్మనియనులును బొడువ, ఇండియను లొకరివెంట నొకరుగా వెనుకడుగిడక యనేకులగు జెర్మనివారిని బొడిచిచంపి జయశీలురనఁ బొగడఁబడిరి.

ఫ్లాండర్స్ యుద్ధము జరుగుచుండఁగా, బెల్జియనులకును జెర్మనియనులకును నొక యగడ్తకు సమీపమున 45 గంటలకాల మతిఘోర యుద్ధము జరిగెను. బెల్జియనులు మిక్కిలి బడలి సోలనట్టి తరుణమున నిండియను లాయగడ్తలందు దుమికి దాఁగియుండి శత్రువుల నీటెలతోఁ బొడిచి సుమారు పదివేగురను జంపిరి. ఇండియనుల సామర్థ్యమున కోర్వఁజాలని జెర్మనియనులు వెన్నిచ్చి పరుగిడు సమయమున వీరును వారిని దఱుముకొనిపోయి చెల్లాచెదరు గావించిరి.

కొన్ని తరుణములలో వీరి నేమరింప వచ్చిన జెర్మనివీరు లనేకులు వీరిచేఁ జక్కఁగా మొత్తఁబడియు గాల్పఁబడియు నీటెలతోఁ బొడువఁబడియు ఛిన్నాభిన్నము చేయఁబడుచున్నారు. వీరు తమపైఁ బడుచుండు పిఱంగిగుండ్లనుఁ గొంచెమైనను గొంకనివారై వాటినిఁ బుష్పవృష్టిగ భావించి మహాధైర్యముతోఁ గావించుచుండు యుద్ధ మత్యద్భుత మైనది.

ఒకనాఁడొక యగడ్తలో నిండియాసైన్యమును జేరిన గంగాసింగను హవల్దారుఁ డొకఁడు పదునైదుగురు వీరులతో జెర్మనివారి నెదిరించి పోరుచుండెను. అది గాంచిన జెర్మని సేనలోని యొకయధికారి గంగాసింగును దన (పిస్తోలు) చేతి చిన్న తుపాకితోఁగాల్చెను. ఆ గుం డొకటి వాని శిరస్సునఁ దగులఁగా నా హవల్దారుఁడు తూటితో నదల్పఁబడిన పెను సింహమువలె గుపితుఁడై యాజెర్మని సేనానాయకుని పైకిలంఘించి కాల్చి వాని చేతనున్న కత్తి చేతనే వానిని రెండు తుండెములు గావించి, వానికి సహా-

యముగా వచ్చిన పదుగురు జెర్మనియనులను సైతము తునియలు గావించెను. తక్కిన వీరులను దన పిడికిటం బొడిచి పడద్రోయుచుండగాఁ గొందఱు జెర్మనియనులు పరుగునవచ్చి తమ తుపాకులతో వాని తొడలను భుజములను తూట్లుగను గాల్చిరి. ఆ దెబ్బలకు భీమతుల్య పరాక్రముఁడగు గంగాసింగు మూర్ఛిల్లి నేల కొఱఁగెను. దీనింగాంచిన జెర్మనియనులు వాఁడు చచ్చెనని యెంచి వాని నచ్చోటనే విడిచిపోయిరి. తరువాత కొంతసేపటికిఁ దెలివొందిన గంగాసింగును దన సేనలం జేరి తనకుఁ దగిలిన గాయములను మాన్పుకొనెను. వీఁడు గాంగ్రాజిల్లా తిక్కాదేశపువాఁడు: కీనితో నుండిన యితర వీరు లందఱు నుజచ్చిరి. వీని బలపరాక్రమములకును ధైర్యసాహసములకును మెచ్చి మన చక్రవర్తి వీనిని పలువిధములఁ గొనియాడి యాంగ్లేయులలోని యత్యున్నతోద్యోగుల కిచ్చు 'విక్టోరియా క్రాస్' అను బిరుదము నొసంగి యొక పతకమును గూడ బహుమతిచేసిరి.

తరువాత గార్వాల్ పటాళము జేరిన దర్వాన్‌సింగనువాఁడును, బెలుచిస్థానపుఁ బటాలముతోఁ జేరిన సిపాయి ఖుదాదాద్ అనువాఁడును మహా సాహసముతో యుద్ధముచేసి, మన దొరతనమువారివలన గంగాసింగు వలెనే బహుమానములం బడసిరి.

ఇట్లు మన యిండియా సేన లనేక స్థలములయం దనేక విధములగు నత్యద్భుత పరాక్రమములను జూపి యందఱచేతను గొనియాడఁబడుచుండుట వినువారికెల్ల నానందమును ఉత్సాహమును గలిగింపక మానదు.

---

## 18. INDIAN PRINCES FOR ACTIVE SERVICE

## యుద్ధరంగమున కేగిన ఇండియా రాజులు

తరతరముల నుండియు యుద్ధాసక్తి గలిగి యుండిన యిండియా రాజులలోఁ గొందఱు మన చక్రవర్తియందు గల తమ ప్రభువిశ్వాసము వలని ప్రేరణమునఁ దమ ప్రాణములను సైతము నొసంగుట కుద్యుక్తులై తమ సేనలతోడ యుద్ధరంగమును జేరియున్నారు.

అట్టి వారిలోఁ గొందఱినిగూర్చి మనము తెలిసికొనఁ దగిన విషయములు కొన్ని గలవు. వాని నిం దుదహరింతము:—

## 1. H. H. THE MAHARAJA OF PATIALA

### పాటియాలా మహారాజు

పాటియాలా యనునది పంజాబు దేశములోని ముఖ్య సంస్థానములలో నొకటి. ఇయ్యది 5,412 చదరపుమైళ్ల వైశాల్యము గలది. ఇందలి జన సంఖ్య 1,412,000. ఇందలి జనులలో ననేకులు సిఖ్ జాతివారు. దీని యొడయఁడు మహారాజా 'భూపేంద్రసిం' గనునతఁడు. ఈయన చెండ్లాటయం దతిప్రియము గలవాఁడు: 1900-వ సంవత్సరమున సింహాసన మెక్కెను. అప్పు డీయన తొమ్మిది సంవత్సరముల వయసు గలవాఁడు: 1910-వ సంవత్సరమున రాజ్యాధికారమును వహించి స్వయముగనే రాజకీయ వ్యవహారములను జరుపుకొనుచు వచ్చుచున్నవాఁడు.

ఈ సంస్థానము 1762-వ సంవత్సరమున ప్రత్యేకరాజ్యము నేర్పరచుకొని యదే సంవత్సరమున 'అహమద్ షా దురాణి' అను నతని వలన అప్పటి దీని ప్రభువగు 'ఆలాసింగ్' అను నతనికి 'రాజా' యను బిరుదు గలిగించి యదిమొదలు స్వేచ్ఛగా నున్నయది. ఈ సంస్థానపు రాజవంశమునఁ బురుషులు మాత్రమేగాక స్త్రీలును యుద్ధవిద్యా పారంగతులైన సైన్యాధ్యక్షులుగా నుండినట్లు దెలియవచ్చుచున్నది. ఈ సంస్థానముపై మహారాష్ట్రులు రెండుమారులు దండెత్తినపుడు, 'కువార్ సాహేబా' మహారాణి తన సేనలతోడ నెదిరించి బహు సామర్థ్యముతో వారల నోడించినది. ఈమె కాలముననే యీరాజ్య మాంగ్లేయుల విచారణకు లోఁబడినది. చక్రవర్తికి సహాయము చేయుటకై యాయా సంస్థానపు సొంత ఖర్చులతో నొక్కొక సంస్థానమునందును ఆంగ్లే యోద్యోగుల వలనఁ జక్కఁగా శిక్షింపఁబడి పేరుండు 'ఇంపీరియల్ సెర్విస్' పటాళము మొట్టమొదట నీ రాజ్యముననే చేర్పఁబడినది. ఈ సంస్థానపు సేనలు 1814-వ సంవత్సరమున గూర్ఖాలతోడ యుద్ధమునను, 1857-వ సంవత్సరమున గలిగిన సిపాయీల కలహమునను, ఆంగ్లేయులకు సహాయముగా నిలిచి యుద్ధము సలిపెను. తరువాత మణిపూరు, చిత్రాల్, కాబూల్, సర్హా మొదలగు స్థలము-

లలో నడచిన యుద్ధములయందు మన దొరతనమువారికి సహాయ మొన-రించియున్నది.

## ii. H. H. THE MAHARAJA OF BIKANIR

### బికానీర్ మహారాజు

బికానీర్ సంస్థానము రాజపుత్రస్థానమునఁ గలదు. ఇది 23,311 చద-రపు మైళ్ల విస్తీర్ణముగలది. ఇందలి జనసంఖ్య ఆరులక్షలు. దీని యేలిక 'గంగాసింగు' అనునతఁడు. ఈయన రాజపుత్ర జాతియందలి రాథోర్ తెగను జేరిన వాఁడు. 'బీకా' అనునతనిచే స్థాపితమైన రాజవంశమున నితఁడిరువదియొక-టవ తరమువాఁడు. ఈయన యాంగ్లేయ భాషయందు విశేష పరిచయము గల-వాఁడు: అజ్మీర్ దేశమునందలి రాజపుత్ర కళాశాలయందు విద్య నభ్యసిం-చినవాఁడు. ఇతని యొంటెల పటాళము మిక్కిలి ప్రసిద్ధిఁ జెందినది. ఇతఁడు చీనా సోమాలిలాండు మొదలగు చోట్ల యుద్ధము జరిగిన కాలములందు వానిం గలసి యుద్ధముచేసియున్నాఁడు. ఈయన మన చక్రవర్తి కత్యంత మిత్రుఁడు. ఇతఁడు 1909-వ సంవత్సరమున నాంగ్లేయసేనలం గలసిన కాలమున లెఫ్టి-నెంటుకర్నలుద్యోగమును 1910-వ సంవత్సరమునఁ గర్నలుద్యోగమును వహించియున్నాఁడు. ఈయన మన చక్రవర్తికి ఏడికాంగుగ నియమింపఁ బడియుండెను. ఈసంస్థానము మన యాంగ్లేయ దొరతనమువారికి యేలాటి పన్నును గట్టుటలేదు.

## iii. H. H. THE MAHARAJA OF IDAR

### ఇడార్ మహారాజు

ఇడారు సంస్థానము బొంబాయిరాజధానికి సంబంధించిన మాహీ-కాంతా యను జిల్లాలోఁ జేరినది ఇది మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. దీని విస్తీర్ణము 1,669 చదరపుమైళ్లు. దీనిరాజు 'దౌలత్ సిం' గనువాఁడు. ఈయన జోడ్పూరు మహారాజు తమ్ముఁడైన 'సర్ ప్రతాపసింగు' మహారాజు కుమా-రుఁడు. ఇతఁడు 1878-వ సం॥ మే నెలలో జోడ్పూరున జననమంది, 1911-వ సం॥ జూలై నెల 21-వ తేదియందీ యైడార్ సంస్థానమునకు రాజయ్యెను. ఈయన అజిమీరు కలాశాలలోఁ నాంగ్లేయ భాష నేర్చి జోడ్పూరున సైన్య-

మునంజేరి యుద్ధ విద్య నేర్చికొని యా సేనలకే యధికారి యయ్యెను. ఈయన ఎడ్వర్డు చక్రవర్తి పట్టాభిషేకమునకై తన తండ్రితోడ నింగ్లండునకుఁ బోయియుండి యప్పుడు యువరాజుగానుండిన మన జార్జి చక్రవర్తికి ఏడి-కాంగుగా నియమింపఁబడియెను. ఇతఁడు మహారాజగుటయు మన చక్ర-వర్తిగారి పట్టాభిషేక మహోత్సవమునకును నింగ్లండునకుఁ బోయియుండి యంటనేక మర్యాదలనుఁ బొందెను. ఈయన కాతియవార్ సంస్థానము నుండి కొందఱు సైనికోద్యోగస్థులయొక్క సహాయము వడసి మన దేశ-మునఁ గొన్ని సేనలను జేర్చెను. ఈ సేనల కధికారులు 'సర్దారు'లనఁ బడుదురు. వీరట్టి తొమ్మండుగురు సర్దారులతోడను దమ సైన్యములలోఁ గొన్నిటి తోడను యుద్ధరంగమున కేగి యున్నారు.

## iv. H. H. THE MAHARAJA OF JODHPUR

## జోడ్‌పూర్ మహారాజు

జోడ్‌పూర్ సంస్థానము రాజ పుత్రస్థానము నందుండునది. ఇయ్యది 34,963 చదరపు మైళ్ల విస్తీర్ణము గలది. ఇందలి జనసంఖ్య 2,050,000. ఇప్పటి దీని రాజు 'సర్ ప్రతాప సిం'గను మహనీయుఁడు. ఈయన తన యన్న కుమారుఁడు గతించిన వెనుక ఆయన కుమారుఁడగు 'సూమర్ సింగ్' బాలుఁడై యున్నందున నీ జోడ్పూరు సంస్థానముయొక్క పాలనాధికారమును దాను వహించెను. ఈయన మహా శూరుఁడు. బాల్యమునుండియు యుద్ధ విషయము-నందే మిక్కిలి ప్రీతి గలవాఁడు. ఈయన వయస్సరువది యెనిమిది యేండ్లు. ఈయన జోడ్‌పూరు రాజ్యమున 1889-వ సంవత్సరమున రాజపుత్ర స్వదేశీ-యులగు రాజపుత్రులను జేర్చి యొక పెద్ద పటాళమునుఁ దయారు చేసి యున్నాఁడు. 1878-వ సంవత్సరమున నాంగ్లేయ సేనలతోడఁ గాబూలునకు పోవుటయును, 1887-వ సంవత్సరమున యువరాజునకు నేడీకాంగుగ నియమింపఁబడుటయును, 1889-వ సంవత్సరమున తీరాయుద్ధమునకుఁ బోవుటయు నాంగ్లేయులు గాంచి యీయనకు కర్నలు బిరుదము నొసంగిరి. ఈయన తమదేశపు సేనలతో 1900-వ సంవత్సరమున చీనాదేశపు యుద్ధ-మున మన యాంగ్లేయులం గలసి విశేష ఖ్యాతిని వహించెను: చెండ్లాట-యందు గొప్పవాఁడని లోక విఖ్యాతిఁ జెందినవాఁడు.

ఈయన తన యన్నమనుమని తోడను సేనలతోడను యుద్ధమునకు వెళ్లియున్నవాఁడు.

## v. H. H. THE NAWAB OF JAORA

### జోరా నబాబు

జోరాయనునది మాళవదేశమున నుండునది. దీనివైశాల్యము 568 చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య 82,500. దీనికి 'మహమ్మదు ఇఫ్తిఖార్ అలీఖాన్' అనునతఁడు నబాబు. ఈయన తన పండ్రెండవయేట పట్టము గట్టు-కొని, ఇందూరు కాలేజిలో 1899-వ సంవత్సరము వఱకు నాంగ్లేయభాషను జదివి, తర్వాత 15 నెలలు యుద్ధపరిశ్రమను వడసెను. ఈయన 1905-వ సంవత్సరమున నాంగ్లేయ సేనయందు మొదట కాప్టన్ అధికారమును బొంది తరువాత మేజరుద్యోగము నొందెను. ఈయన మహాశూర పరం-పరలో జనించినవాఁడు.

## vi. H. H. THE MAHARAJA OF RUTLAM

### రట్లం మహారాజు

రట్లమనునది మధ్యేందియాలోని యొక చిన్న రాజ్యము. దీని వైశాల్యము 1,138 చదరపు మైళ్లుగలది. ఇందలి జనసంఖ్య 85,000. ఈరాజ్య-ము 'షాజహాన్' చక్రవర్తి కాలమున జోడ్‌పూరు మహారాజుముని మనుమఁడగు 'రతన్‌సింగ్' అను నతనిచే స్థాపితమైనది. 'సర్ సజ్జన్ సింగ్' అను-నతఁడు దీనికిఁ దత్కాలపు రాజు. ఈయన ఇండూరిలో నాంగ్లేయ విద్య నభ్యసించి, 1903-వ సంవత్సరమున సైన్యమునం జేరి శిక్షితుఁడై యాంగ్లేయ సైన్యములకు గౌరవ కాప్టనుగా నియమింపఁబడియె. ఈతనియొద్ద గుఱ్ఱపు సైన్యమును పదాతిసేనయును గలవు. ఈయనయును గొంత సైన్యముతో యుద్ధ భూమికిఁ బోయి యున్నాఁడు.

## vii. H. H. THE PRINCE OF BHOPAL

### భోపాల్ రాజకుమారుఁడు

భోపాల్ దేశము మధ్యేందియాలోనిది. దీని వైశాల్యము 6,902 చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య తొమ్మిది లక్షలు. ఈ సంస్థానపు రాణి

'జాన్ బేగం సాహేబ్' గారి రెండవ కుమారుఁడగు 'కర్నల్ ఉబయదుల్లాఖాన్' తన సేనలతోడ యుద్ధమున కేగుచుండఁగా, దేహము జబ్బుచేసినందున తనకిష్టము లేకున్నను మన దొరతనమువారివలన ఏడన్ రేవున నుంపఁబడి యుండియోగా కంపఁబడియెను. ఇతఁడు శూరాగ్రేసరుఁడు. 1726-వ సంవత్సరమున మొట్టమొదట నీసంస్థానమును స్థాపించినవాఁడగు 'దోస్ట్ మహమ్మదుఖాను'ని వంశమునకు సంబంధించినవాఁడు. ఇతఁడు 1905-వ సంవత్సరమున నీ రాజ్యపు సేనలకు అధిపతిగా నియమింపఁబడి దానియం దనేకములగు దిద్దుబాట్లొనరించెను. ఇతనియొద్ద మిక్కిలి సామర్థ్యముగల గుఱ్ఱపు సేనయును బదాతులును గలవు.

## viii. H. H. THE MAHARAJA OF KISHENGARH

### కిషన్‌గార్ మహారాజు

కిషన్‌గారను సంస్థానము రాజపుత్రస్థానమున నుండునది. దీని వైశాల్యము 858 చదురపుమైళ్లు గలది. ఇందలి జనసంఖ్య 8,000. దీని యేలిక 'మదన్ సింగ్' అనువాఁడు. ఈయన 1884 సం॥ బుట్టినవాఁడు; 16-వ శతాబ్దమున జోద్పూరు రాజైయుండిన యుదయసింహ మహారాజు వంశ పరంపరలోఁ జేరినవాఁడు. ఈయన రాజపుత్రులకుఁ బ్రధానుఁడైన యుదయపురీశుని పుత్రికను బెండ్లాడెను. ఈయనయొద్ద సుమారు 2,000 యుద్ధవీరులును 65 ఫిరంగులును గలవు. ఈయన మహా శూరుఁడు.

## ix. H. H. THE NAWAB OF SACHIN

### సచ్చిన్ నబాబు

సచ్చిన్ సంస్థానము బొంబాయి రాజధానిలోని యొక చిన్న రాజ్యము. ఇది 42 చదరపుమైళ్లును ఇరువదివేల జనసంఖ్యయును గలిగి యొక మహమ్మదీయ నబాబుచేఁ బాలింపఁబడుచున్నది. ఈ నబాబుపేరు 'సిద్దిక్ ఇబ్రాహీమ్ ముహమ్మదు యాకూబ్ ఖాన్'. ఈయన రాజ్‌కోట్ కాలేజియందును అజ్మీరులోని మేయో కాలేజి యందును నింగ్లీషు నభ్యసించి, 'ఇంపీరియల్ కాడెట్ కోర్' అను సైన్యమునఁ జేరి సేనావిన్యాసాది రహస్యముల జక్కఁగ నెఱింగి దానికి లెఫ్టినెంటయ్యెను. తరువాత 1909-వ సం॥

వీరి కాంగ్లేయ సైన్యమున గౌరవకాప్టెన్ అధికార మొసఁగఁబడెను. ఈయన బొంబాయి గవర్నరుకు గౌరవ యేడికాంగుగా నియమింపఁబడి యున్నాఁడు. ఈయన మహాధైర్యశాలియై రంగమునకుఁబోయి యుద్ధము చేయవలయునని యపేక్షించినందున మన రాజప్రతినిధి వీరి ప్రార్థన నంగీకరించి యుద్ధమున కంపియున్నాఁడు.

## x. H. H. THE MAHARAJA OF COOCH BEHAR

## కుచ్ బేహార్ మహారాజు

కుచ్ బేహారను సంస్థానము బంగాళాదేశము నుత్తరభాగమున నుండునది. ఇయ్యది 1,307 చదరపు మైళ్ల వైశాల్యమును, 593,000 జనసంఖ్యయును గలిగి 'రాజేంద్ర నారాయణబప్' అను నతనిచేఁ బాలింపఁబడుచున్నది. ఈయన 1882-వ సం॥ బుట్టినవాఁడు: ఆంగ్లేయ భాషను జక్కఁగఁ జదివినవాఁడు. ఈయన యొద్ద నొక చిన్న సేనయును గలదు. ఈతని తాతగారు చనిపోయిన సమయమున వీరి తండ్రి యొక సంవత్సరపుఁ బిడ్డగ నుండెను. అప్పుడాంగ్లేయు లీరాజ్యమును బాలించుచుండి శిశువుగానుండిన 'నృపేంద్ర నారాయణబప్' అను వీరి తండ్రికి కాశీపట్టణమునను కలకత్తా నగరమునను ఇంగ్లండునను విద్యనేర్పిరి. ఈ నృపేంద్రబప్ యుక్తవయసుగలవాఁడగుటకుఁ బూర్వమే 1863-65-వ సంత్సరములలో నడచిన బూటాన్ యుద్ధమున నాంగ్లేయులకు మిక్కిలి సహాయుఁడుగా నుండెను. ఈయన 1883-వ సం॥ పట్టమునకు వచ్చిన వెంటనే మన దొరతనమువారు వీరి నడతలకు మెచ్చి 1885-వ సంవత్సరమున నీయనకు 'మహారాజా' యను బిరుదునొసంగిరి. ఆంగ్లేయ సైన్యమున గొప్ప యధికారమును సైత మొసంగిరి. ఈయన పలుతడవ లింగ్లండునకుఁ బోయి యచ్చట మిక్కిలి ప్రసిద్ధినొంది మన చక్రవర్తికి నేడికాంగుగను నియమింపఁబడిరి. ఈయన 1911-వ సంవత్సరం సెప్టంబరు నెల 21-వ తేదిని లండన్ నగరమునఁ గాలధర్మము నొందిరి. వెంటనే యీయన కుమారుండగు రాజేంద్ర నారాయణబప్ పట్టమునకు వచ్చెను. ఈయనయు మహా శూరుఁడు: ఈయనతమ్ముఁడైన 'హితేంద్ర నారాయణ' యను నతఁడు తత్కాలపు యుద్ధరంగమున కంపఁబడి యున్నాఁడు. ఈ రాజ్యము 1773-వ సంవత్సరము మొదలు ఆంగ్లేయుల యధికారమునకు లోఁబడి యాంగ్లేయులకు వలయు సహాయము లొనర్చునదియై యున్నది.

## xi. H. H. THE MAHARAJA OF PANNA

## పన్నా మహారాజు

పన్నా యనునది మధ్యేందియాలోని బండిల్ ఖండమున నుండునది. ఇయ్యది 2,492 చదరపు మైళ్ల వైశాల్యమును 200,000 జనసంఖ్యయును అనేక వజ్రగనులను గలిగి యొప్పుచున్నది.

ఈ సంస్థానమునఁ 'బ్రాణనాథు' డను నొక మతాచార్యుఁడు 18-వ శతాబ్దమున మిక్కిలి ప్రసిద్ధి జెందియుండి యిందలి జనులచే మిక్కిలి మర్యాదలఁ బడయుచుండెను. ఈయన హిందువులకును దురకలకును మైత్రిని గలిగింపం దలంచి వేదములనుండియు కొరానునుండియు దాని కనుకూలములైన విషయముల నెత్తిచూపి 'మహితారియల్' అనునొక పెద్ద గ్రంథమును రచియించెను. ఈ గ్రంథ మీ దేశములోని దేవాలయమున నొక సువర్ణపీఠముననుంపఁబడి పూజింపఁబడు చున్నది. వీరి మతమునందలి యభిప్రాయములు స్తోత్ర పాత్రములై యున్నవి.

ఈ రాజ్యము 1811-వ సంవత్సరమున నాంగ్లేయుల స్వాధీన మైనది. దీని రాజు 'మహేంద్ర జాద్ వేంద్రసింగ్' అనువాఁడు. ఈయన 1893-వ యేట జననమంది, 1902-వ సంవత్సరమున రాజ్యాధికారమునకు వచ్చెను. ఈయన అజ్మీరులోని మేయోకాలేజిలో నాంగ్లేయ విద్య నభ్యసించెను. ఈయన యొద్ద నొక చిన్న పటాలమును గొన్ని పిఱంగులును నున్నయవి. ఇప్పు డీయన తమ్ముఁడు 'హిరసిం' గనునతఁ డైరోపాయుద్ధమున కేగియున్నాఁడు. వీరికిఁ బూర్వుఁడైన 'నృపత్ సిం' గను నతఁడు మహా సిపాయీల కలహమున నాంగ్లేయులకు కలింజార్ కోటను రక్షించి యిచ్చి మహోపకార మొనర్చెను. అందువలన మన దొరతనమువారు సంతసించి వీరికి 'మహేంద్ర' బిరుదమును, సిమారియా మండలముతో 20,000 రూపాయలను బహుమానముగా నొసంగిరి.

## xii. H. H. THE NIZAM OF HYDERABAD

## హైదరాబాదు నైజాము

హైదరాబాదు సంస్థానము ఇండియా యొక్క మధ్యభాగమున 83,000 చదరపు మైళ్ల వైశాల్యమును (అనఁగా మైసూరు సంస్థానము కన్న

మూఁడు పాళ్లధికమైనది; మఱియు నిండియాలోని యన్ని సంస్థానములకన్నను పెద్దది) కోటియు ముప్పదిలక్షల జనసంఖ్యయును గలిగి సంవత్సర మొకటింటికి నైదుకోట్ల రూపాయల వచ్చుబడి గల యొక మొగలాయి రాజ్యము.

ఈ రాజ్యమున ననేక స్థలములందు బంగారు, వజ్రములు, నేలబొగ్గును దొరకెడి గను లనేకములు గలవు. ఈ దేశపు రాజు 'నైజామ్' అను బిరుదు గలిగి వెలుంగును. ప్రస్తుతమున దీనికి 'మీర్ ఉస్మాన్ అలీఖాన్' అనునతఁడు నైజామైయున్నాఁడు. ఈ సంస్థానము 'మహమ్మద్ షా' ఢిల్లీచక్రవర్తిగా నున్న కాలమున నతనిమంత్రి యగు 'అసబ్ జా' యను నతనిచే స్థాపింపఁబడినది. ఇది కొంతకాలము మరాఠీవారికి లోఁబడియుండి తుదకు 1766-వ సంవత్సరమున నాంగ్లేయుల యధికారమునకు లోఁబడియెను. ఇది పలుతడవ లనేకులు రాజులతో యుద్ధము సలిపి యాంగ్లేయులకు సహాయ మొనరించెను. ఇప్పటినైజామునకుఁ దండ్రియైన 'మీర్ మహబబ్ అలీ ఖాన్' రెండున్నర సంవత్సరముల బిడ్డగానుండఁగా నాయన తండ్రి కాలధర్మ మొందినందువలన, ఆయన బాల్యమునుండి యాంగ్లేయులచే విద్యాభ్యాసము చేయింపఁబడియెను. ఆ తరుణమున నీ రాజ్యము 'సర్ సాలర్ జంగ'ను మంత్రిపుంగవునివలన నేలఁబడుచుండెను. ఈయన కాలముననే యీ రాజ్యము మిగులఁ బ్రఖ్యాతితో వృద్ధినొందెను. మైనరుగానుండిన బాలనైజాము వైసరాయిగా నుండిన 'రిప్పన్ ప్రభువు' కాలమున 1884-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 5 తేదినిఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈయన 1885-వ సంవత్సరమున దమసేనల నీజిప్టున కంపి 1887-వ సంవత్సరమున ఋష్యావారి నెదిరింప మన దొరతనమువారికి సహాయముగా నిలచెను.

ఇతఁడాంగ్లేయ రాజప్రతినిధుల కెల్ల నత్యంత మిత్రుఁడై యుండెను: అందఱివలనను మర్యాద నొందినవాఁడు. మన దొరతనమువా రితనికి పలుతడవ లనేక బిరుదుల నొసంగియున్నారు. ఈయన యాంగ్లేయ సైన్యములకు గౌరవాధికారము వహించియుండినవాఁడు. ఈయన యిరువదియేడు సంవత్సరములు రాజ్యము నేలి 1911-వ సంవత్సరము అక్టోబరు నెల 29 తేదినిఁ గ్రూరమైన పార్శ్వవాయువు తగిలి పరలోకగతుండయ్యెను. ఈయన ప్రియపుత్రుఁడైన 'నబాబ్ మీర్ ఉస్మాన్ అలీ ఖాన్' రాజ్యమునకు వచ్చెను: ఈయన 1886-వ సంవత్సరము ( జనవరి నెల 21-వ తేదిని జనించి

1911-వ సంవత్సరమున అక్టోబరు నెల 17-తేదీని మన 'హార్డింజి' ప్రభువర్యుని వలన సింహాసనాసీనుఁడు గావింపఁబడెను. మన చక్రవర్తి ఢిల్లీ దర్బారు నలంకరించినపుడు ప్రప్రథమముగఁ దను రాజవిశ్వాసమును జూపి మెప్పుకొన్న-వారిలో నీయనయే మొదటివాఁడు. ఈయన యాంగ్లేయ విద్యను జక్కఁగ నభ్యసించినవాఁడు; మిక్కిలి దయయును శాంతమును గలవాఁడు. వీరి చేతిక్రింద 10,000 పోలీసు సేనయును, సాలునకు డెబ్బది లక్షల రూపాయల వేతనముల బొందుచుండు యోధ వీరులును గలరు. ఈయన యాంగ్లేయ సేనలందును గొప్ప యధికారము వహించియున్నాఁడు. ఇప్పు డైరోపా-యందు జరుగుచుండు యుద్ధమున కీయన దన సేనలలోఁ గొంత భాగమును 'షా మీర్ జా బే' యను నతని యాధిపత్యము క్రింద యుద్ధరంగమున కంపి యున్నాఁడు.

---

## 19. THE QUEEN AND THE PRINCE OF WALES

## మహారాణియు యువరాజును

మహాఘనత వహించిన మన మేరీ చక్రవర్తిని యుద్ధము జరుగకుండు-టకై యెన్నియో విధముల యత్నించెను కాని, అది నెరవేరక పోయెను. ఇప్పుడును యుద్ధమున గాయములు తగిలివచ్చిన వీరుల నుపచరించు సాధారణ స్త్రీలతోఁ దానును గలసి, వారికి ఔషధము లిచ్చుటయు కట్లు కట్టుటయు మొదలగు విషయములకు వలయు నన్ని సౌకర్యములను సముఖ-మునవుండి సమకూర్చుచున్నది. మఱియును, యుద్ధవీరులకు వలయు నుడు-పులు మొదలయిన యుపకరణముల నితర స్త్రీలతోఁ దానును గలసి సిద్ధము చేయుటయే గాక, యుద్ధరంగమునఁ బనిసేయుచున్న కొందఱు వీరుల యిండ్లకు స్వయముగఁ బోయి వారి కుటుంబముల నత్యంతాదరములో విచారించి వారలకు వలయు నుపకారములఁ జేయుచున్నది.

మన యువరాజు యుద్ధమున జనిపోయిన వీరుల కుటుంబముల పోష-ణార్థ మొక నిధి నేర్పఱచి యద్దానికిఁ దా మపరిమిత ధనమునిచ్చి యితరుల

వలన సైతము ధనము ప్రోగుచేయుచున్నవారు: తామే స్వయముగ యుద్ధరంగమునకుఁ జేరి పోరుచున్నారు. ఈ రాంగ్లేయ సేనలకెల్లఁ బ్రధానుఁడగు 'జెనరల్ ఫ్రెంచ్' అను దొరకు ఏడికాంగుగ నియమింపఁబడి యున్నారు. ఆ యుద్యోగము మిక్కిలి యపాయకరమైనదైనను, యువరాజ చంద్రులు మహోత్సాహముతో దాని నొప్పుకొని విశేష ధైర్యముతో జరుపుకొనుచున్నారు. యుద్ధ సమయము దప్పఁ దక్కిన సమయములందు శత్రువులచే గాయపరుపఁబడిన వీరులకు మందులు వేసి కట్లు కట్టుట ఆహారము లిచ్చుట మొదలగు కార్యములు చేయుచున్నవారు. మఱియును, తమవారిచేఁ బట్టుపడిన శత్రు సేనలనుసైత మత్యంత వాత్సల్యముతో నాదరించుచున్నారు. దీనివలన పగవారును వీరి దయాగుణమును పలువెఱఁగులఁ గొనియాడుచున్నారు.

---

## 20. INDIAN LOYALTY

## ఇండియావారి రాజవిశ్వాసము

మన చక్రవర్తికిని జెర్మనివారికిని యుద్ధ మారంభ మయ్యెనని తెలియఁగానే, ఆసేతు సీతాచల మధ్యమునను న్న హిందువులును మహమ్మదీయులును దక్కిన యితర జాతులవారును ఒకటియై ప్రతిస్థలమునను సభలం గూర్చి యీ యుద్ధమునందు మన చక్రవర్తిగారు ప్రవేశించిన కారణముల నామోదించి మన చక్రవర్తిగారికి వలయు సహాయములఁ జేయఁ దీర్మానించి, చక్రవర్తిగారికే జయము గలుగవలెనని వారి వారి యిష్టదైవములను అనుదినమును ప్రార్థించుచున్నారు.

వారు వారు తమ తమ శక్త్యనుసారము ద్రవ్యసహాయము చేయుటయేగాక, తామును యుద్ధరంగమునకు వచ్చుటకు సర్వసిద్ధులై యుండుటయును, యుద్ధరంగమున సేనానాయకులు తమ కేపని బెట్టినను శిరసావహించి చేయుటకు సిద్ధముగనున్నటులును తెలియఁజేసిరి. ఇండియాలో దాదాపుగా యేనుఁవందల స్వదేశసంస్థానములున్నవి. వాటి యధిపతులందఱును దమ తమ రాజ్యములందు వచ్చెడి సర్వవిధాదాయములను యుద్ధపు సెలవులకిచ్చుటే గాక, తామును దమ సేనలతోడ వచ్చి యాంగ్లేయ సైన్యమునం గలసి

యుద్ధము సేయుటకు ముందకుఁ బెట్టియున్నారు. ఇదియునుగాక, యుద్ధ ఖర్చులకై లక్షలకొలది ధనము నిచ్చుచు యుద్ధమున దెబ్బలు దగిలినవారికి వలయు సౌకర్యములుగలిగించుటకు పేరాళ్ళమైన ద్రవ్యమును ఆహారపదార్థములును ఉడుపులు మొదలగునవియును ఇచ్చియున్నారు.

ఇండియాలోని యిరువదియేడుగురు ప్రధాన సామంతరాజులలో హైదరాబాదు నబాబు సాహేబుగారు తమ సైన్యములలో విశేషభాగమును యుద్ధమున కంపియున్నారు: మఱియును అరువదిలక్షల రూపాయలు నిచ్చియున్నారు: తాము యుద్ధమునకుఁ బోవ సిద్ధముగనున్నారు.

మైసూరు మహారాజుగారునుఁ దమ సేనల నంపున ట్లొప్పుకొని యున్నారు. యుద్ధ ఖర్చులకై యేబది లక్షల రూపాయల నిచ్చియున్నారు: ఇదియునుగాక, యుద్ధవీరుల కుటుంబములకుఁ దగిన యేర్పాటులు సేయుటకై విశేష ద్రవ్యము నొసంగియున్నవారు. ఈ విధముగనే బరోడా జయపూర్ మొదలగు సంస్థానాధీశులు తమ సైన్యములను యుద్ధభూమి కంపినదేగాక, వాటి ఖర్చులకై యనేకలక్షల రూపాయల నిచ్చియున్నారు.

గ్వాలియరు మహారాజు వేయిగుఱ్ఱములను, పంజాబు దేశపు చిల్లర సంస్థానాధీశులును సర్దారులును జేరి యనేకములగు ఒంటెలను, రీవా సంస్థానాధీశుఁడు తమ సేనలను అంతవఱకుఁ జేరియుండిన ఖజానా ధనమును తమ సొంతమయిన యాభరణములను ఇచ్చిరి. హోల్కారు మహారాజును, జాం నగరపు రాజును, చెన్నరాజధానియందుండు జమీన్దారులును గూడి యనేకవేల గుఱ్ఱముల నిచ్చుట కొప్పుకొని యున్నారు.

చిత్రాల్ దేశపు ప్రభువును, కైబరు కనుమలలో నుండు పూర్వపు స్వదేశ జాతులవారును, నేపాలపు దొరతనమువారును సహాయము జేయునట్లు తెలియఁజేసి యున్నారు. పైఁ జెప్పిన ప్రకారము యుద్ధమున కేగియుండు పన్నెండుగురు రాజులేగాక, ఇంక ననేకులు రాజులును అనేక లక్షల ధనము నిచ్చి తమతమ సేనలతోఁ దాము యుద్ధభూమికి వెళ్లి యున్నారు. వైద్యశాస్త్రి పారంగతులైన యిండియను లనేకులు యుద్ధరంగమున గాయములు తగిలినవారికి చికిత్స చేయుటకై ముందుకు వచ్చియున్నారు. సామాన్య జనులలో ననేక లక్షలు పదాతిసేనలోఁ జేరుటకును, వేనవేల విద్యార్థులు యుద్ధమున గాయము తగిలిన వీరులకు వలయు నుప-

చారములను చేయుటకును, సైన్యాధికారులు చెప్పిన పనులను చేయుటకును సిద్ధముగ వచ్చియున్నారు. ధనికు లనేకులు యుద్ధమునకుఁ బోయియుండు ఇండియా దేశపు సైన్యములకు వలయు నాహారాదులకగు ఖర్చులలోఁ గొంతభాగము తాము భరించునట్లు ఒప్పుకొని యున్నారు.

ఉత్తర హిందూ స్థానమునందుండెడి గ్వాలియరు మహారాజు మొదలగు వారును అనేకులు జమీందారులు రాజులు మొదలగు ప్రముఖులును గూడి 'లాయల్టీ' యను పేరుగల యొక ఆస్పత్రి యోడయును, చెన్నపురమునుండి యనేకులు జమీందారు ప్రభృతులు 'మదరాస్' అను పేరితోనొక యాస్పత్రి యోడయును, ఆహార పదార్థములు, ఔషధములు, బట్టలు మొదలగు వస్తు సంభారములతోడఁ బంపియున్నారు.

ఇండియాలోని స్త్రీలలో ననేకులు సభలుజేర్చి యుద్ధమునకుఁ బోయి యుండు వీరులకు ఉడుపులు తయారు చేయుచున్నారు. కొందఱు స్త్రీలు గాయము తగిలినవారికి కావలసిన యుపకరణముల నేర్పాటు చేయుచున్నారు. కొంద అంగనలు యుద్ధపుఖర్చులకు ద్రవ్యసహాయము చేయుచున్నారు. గొప్ప గొప్పపట్టణములలోని వధూమణులు కొందఱు రకమువారి గుడ్డలనుగొని యుడుపులకై కత్తిరించి యిచ్చుటయును, మఱికొంద ఱా గుడ్డలకుఁ గూర్పవోసి యిచ్చుటయును, ఇంకఁ గొందఱు వానిని బూర్తిగాఁ గుట్టి యిచ్చుటయును మొదలగు ననేక కార్యములందు మిక్కిలి శ్రద్ధ వహించియున్నారు.

గ్రామాంతరములనుండు రైతులు తమతమ శక్త్యనుసారము ద్రవ్య సహాయము చేయుచున్నారు; మన దొరతనమువారికి జయము గలుగవలెనని దేవాలయములయందు బలమైన యుత్సవములను పూజలను జేయుచున్నారు.

ఇండియాలోని మహమ్మదీయులు తమ మతమువారైన దుర్కీదేశము వారు ఎదటి కక్షి నవలంబించినప్పటికిని, తాము మన దొరతనమువారికి వలసిన సహాయములుసేయ నిర్ణయించుకొని వారువారు విశేష ద్రవ్యము నొసంగి న్నారు: తుర్కీవారి తాత్కాలిక నడవడుల నామోదింపక మన దొరతన- యమునే కోరుచున్నారు. ఇద్దఱు ముగ్గురు మహమ్మదీయరాజులు మన యిండియాసేనలను గలసి జెర్మనివారికి విరోధముగా నాంగ్లేయుల కుపబలముగా యుద్ధరంగమున నిలిచియున్నారు.

ఈ యుద్ధమునకుఁ గలుగు పలు విధములైన ఖర్చులకై మహారాజు లిచ్చినదే గాక, సాధారణ జనులును చిల్లర రాజులును జమీను జాగీరు మిరాదారులును జేరి ఇంతవఱకు డెబ్బదియైదులక్షలరూపాయలిచ్చియుండుట మాత్రమేగాక, ప్రతిదినమును విశేష ధనము నంపుచు నేయున్నారు.

ఇండియాలోనుండు ప్రతిమతమునకును సంబంధించిన మతాధిపతులును జనసముదాయముతోఁబాటు ద్రవ్య సహాయము చేసినదేగాక తమ స్వాధీనములోనుండు మఠములందును ఆలయములందును తమ మతాచార పద్ధతుల ప్రకారము మన చక్రవర్తికి జయము గలుగఁగోరి గొప్ప పూజల నేయ నేర్పాటు చేసియున్నారు.

---

## 21. H. E. LORD HARDINGE

## హార్డింజ్ ప్రభువు

ఇప్పుడు మన యిండియాదేశమునకు రాజప్రతినిధిగా నుండు నతఁడు హార్డింజి ప్రభువు. ఈయన 1910 సం॥ నవంబరు నెల 23 తేదీ ఈ దేశపురాజప్రతినిధి పదవును వహించిరి. ఈయన మిక్కిలి దయగలవాఁడు: రాజతంత్ర నిపుణుఁడు: హిందువులయం దతి ప్రేమ గలవాఁడు. ఈయన యీ యుద్యోగమునకు వచ్చి యిండియా కనేక మేళ్లొనగూర్చెను. వీరివలననే బంగాళా దేశీయుల మనస్తాపము నశించినది. వీరి పరిపాలనముననే ఢిల్లీ నగరమునందు మహా ప్రసిద్ధమైన దర్బారు జరిగినది. వీరి యేర్పాటువలననే బంగాళా దేశమునకు ప్రత్యేకముగా గవర్నరు నియమింపఁబడెను. ఈ మహాత్ముని కరుణచేతనే దక్షిణ ఆఫ్రికాలోని హిందువుల కష్ట మొకతీరుగా నివర్తియైనది.

ఈయన మన చక్రవర్తియొక్క యేర్పాటు ప్రకారము ఢిల్లీనగరమును ఇండియాదేశమునకుఁ బ్రధానపట్టణము గావించి దానఁ దన పరివారములతో ప్రవేశించు తరుణమున ఎవరో రాజద్రోహులు కొందఱు ఈయన క[illegible] గావించిరి. అట్టి సమయమునందును వీరికి హిందువులపై నుంచియుండిన విశ్వాసము తగ్గినది గాదు.

ఈయన యిప్పటి యుద్ధమునకుఁ దన పుత్రునంపి యుండెను. ఈయన యేర్పాటువలననే మన యిండియా సేన లైరోపాకుఁ బంపఁబడినవి. ఈయన శిఫారసుచేతనే మన హిందూరాజులకును గొన్ని ఈ దిగువ నుదహరించిన మేరకు సేనాధికార బిరుదము లీయఁబడెను.

ఇప్పు డైరోపాకుఁ బోయియుండు నిండియా సేనలకు పాటియాలా మహారాజు లెఫ్టినెంటు కర్నలుగాను, ఇడార్ మహారాజుగారు మేజరుగాను, పన్నాదేశపు హిరసింగ్ రాజకుమారుఁడును జోడ్‌పూర్ మైనరు మహారాజును లెఫ్టినెంటులుగను, హైదరాబాదు పటాలముతోఁ జేరిన షా మిర్జా బే అనునతఁడు కాప్టనుగాను, కుచ్ బీహార్ రాజు తమ్ముఁడైన మహారాజ కుమార్ హితేంద్ర నారాయణ అనువారును తికారీదేశపు యువరాజును సర్దార్ జోతీంద్రసింగ్ ప్రభువును లెఫ్టినెంటులుగను నియమింపఁబడిరి.

వీరి పలుకులను బట్టియే ఆంగ్లేయులకును ఇండియనులకును మునుపటికన్న నిప్పుడు స్నేహభావ మతిశయించెను. యుద్ధమునకుఁ బోయియుండు మన యిండియా సేనల సౌకర్యమునకై ఈయన విశేషధనమును దానొసంగినదేగాక, తక్కినవారినుండియు విశేష ధనమును బ్రోగుచేయుచున్నారు: యుద్ధమున మృతినొందు ఇండియా వీరుల కుటుంబ పోషణకును వలసిన ధనమును రాఁబట్టుచున్నారు. ఈయన హిందువుల విషయమై యధికాభిమానముంచెడు ముఖ్య ప్రభువులలోఁ దానొకఁడు. ఈయన యీయధికారముతో నీదేశముననే యింకం గొన్నిసంవత్సరము లుండినయెడల మన దేశమునకుఁ గావలసిన మేళ్లొనఁగూడునని యెంచి యీదేశమువార లనేకులు ఈయన నింకను గొన్ని యేండ్లిక్కడనే యుంచవలయునని మన చక్రవర్తికి విజ్ఞాపన లంపియున్నారు.

యుద్ధమున కేగిన వీరి కుమారుఁడు మహాశూరుఁడని తలఁపఁబడి మన [illegible]ర్తివలనఁ గొన్ని బిరుదులను బొందెను. ఐనను, యుద్ధమునఁ బ్రాణహానియగు గాయముదగిలి యెల్లరును గన్నీరుమున్నీరుగాఁ గార్ప ననేకవిధ యుద్ధవైభవములతో వీరస్వర్గము నలంకరించెను. మన వైస్రాయిగారిట్టి వీరాగ్రేసరుఁడగు పుత్రుని బోఁగొట్టుకొన్నందుల కాంగ్లేయ దొరతనమువారును నొక్కొక్క హిందువును మిక్కిలి దుఃఖించుచున్నారు. సర్వకర్తుఁడగు భగవంతుండు వీరిని దుఃఖసాగరమునుండిఁ దరింపఁ జేయుగాక !

## 22. THE THREE GOVERNORS

## మూవురు గవర్నరులు

### i. H. E. LORD PENTLAND

### పెన్‌ట్‌లన్డ్ ప్రభువు

ఈ మహాత్ముఁడు చెన్నపురికి గవర్నరు. ఈయన 1912 సం॥ అక్టో-బరు నెల 30 తేది యీ చెన్నరాజధాని యధికారమును ఒప్పు-కొనెను. ఈయన మన రాజధాని ప్రజలయందు మాత్రమేగాక, సర్వజనుల-యందును సహజమైన దయాగుణము గలవాఁడు; దైవభక్తి సంపన్నుఁడు; శాంత స్వభావుఁడు; పశ్చాత్తాప బుద్ధిగలవాఁడు. ఈయన తత్కాలమున నడచుచుండు యుద్ధమునందు గాయముతగిలిన సైనికులకు చికిత్సచేయు నిమిత్తముగా నొక ఆసుపత్రి యోడను తయారు చేయించుటయందు విశేష శ్రద్ధ వహించి యందులకై విశేష ద్రవ్యమును వసూలు చేయుచున్నాఁడు. ఈయన 'తండా' యను నొక వ్యాపార నావను గొని దానికి 'మదరాసు' అని నామకరణముచేసి నూరుల కొలఁది పడకలను దానియందమర్చియున్నాఁడు.

ఐరోపాయందు యుద్ధమారంభము కాఁగానే, ఈ రాజధానిలోని వర్తకుల నేకులు నిష్కారణముగా సామాన్యవస్తువుల వెలలను హెచ్చించిరి. ఆ తరుణమున నీయన స్వయముగా వారిని జూచి వారికి హితము జెప్పియు, గొప్ప గొప్ప పట్టణములంగల పెద్దపెద్ద యధికారులను ప్రేరేపించి యం-దందు గల వర్తకులకు తగిన హెచ్చరిక చేయించియు కాపులకు మేలు గావించెను. ఈ యుద్ధము వలనఁ దమకేమి కీడు మూఁడునో యని భయ మందుచుండు పుర జనులకు అనేక విధములచే ధైర్యము చెప్పి వారి హృదయములఁ గుదురుకొన్న భయమును దొలఁగించెను. ఈయన హిందు-లయందు మహా ప్రేమ గలవాఁడు. "పూర్వ భాషీ చ రాఘవః" అన్న ప్రతివారితోడను నీ మహానుభావుఁడు కలసిమెలసి మాటలాడు స్వభావము గలవాఁడు; తనవలనఁ గూడినంతవరకును హిందువుల కుపకారము సేయం గంకణము గట్టుకొని యున్నవాఁడు.

## ii. H. E. LORD CARMICHAEL

### కార్మికేల్ ప్రభువు

ఈయన పూర్వము చెన్నరాజధానికి గవర్నరుగా నుండి యిప్పుడు పై యధికారముచేతనే బంగాళా రాష్ట్రమును బాలించు చున్నవాఁడు. ఈయన 1912 సం॥ ఏప్రల్ నెల 1-తేదిని బంగాళా రాజ్యమునకు నూతన గవర్నరుగా నియమింపఁబడిరి; మహా దయాళువు; ధర్మమునం దతి ప్రీతి గలిగి యెల్లరను సంతోషపెట్టు స్వభావము గలవాఁడు. ఈయన యీరాజధానిని విడిచిపోయినందులకుగా నిచ్చటి ప్రజలు మిక్కిలి చింత గలిగి యున్నవారు.

బంగాళాదేశమునందును నీయన సర్వ సాధారణముగాఁ బ్రజలం గలసి యుద్ధ విషయములను ముచ్చటించి ప్రజల భయమును బోకార్చెను. ఇంతియ కాక, అందలి వర్తకులంగలసి వారి లాభ నష్టములను గూర్చి విచారించి అక్రమ ధరలు లేకుండు నట్లును ప్రజలకు సులభముగా మంచి సరకులు లభించునట్లును తగిన యేర్పాటులను జేసి యున్నాఁడు. యుద్ధమునకు సంభవించు పలు విధములగు సెలవులకును, ఆదేశమునంగల ధనవంతులు, వర్తకులు, రాజులు, జమీన్దారులు మొదలగువారి వలన విశేష ధనమును బ్రోగుసేయుచున్నాఁడు.

ప్రజలకు మేలు చేయుటయే ప్రధాన కార్యముగాఁగల యీ మహాత్మునియం దభిమానము లేని హిందు వొక్కఁడైనను లేఁడు.

## iii. H. E. LORD WILLINGDON

### విల్లింగ్డన్ ప్రభువు

ఈయనయే బొంబాయి రాజధానికి గవర్నరుగా నుండువాఁడు. యన 1913 సం॥ ఏప్రల్ నెల 5 తేది బొంబాయి రాజధానియొక్క పాలనాధికారము నొప్పుకొనియెను. ఈయనయు ప్రజలయం దత్యంత విశ్వాసము గలవాఁడు. ఈయన కుమారుఁడును యుద్ధరంగమున దన శౌర్యమును బ్రకటింపఁ బోయి యున్నాఁడు. ఈయన యుద్ధమునకుఁ బోయియుండు వీరులకు వలయు సౌకర్యములను గలిగింప హేరాళమైన ధనమును బ్రోగు సే[illegible]న్నాఁడు. ఐరోపా ఖండమున యుద్ధమున్న మాట వినఁగానే, బొంబా[illegible]గరవాసులు పొందిన భయమును స్వయముగా వారితోఁ గలసి

మాట్లాడి నివర్తింపఁ జేసిరి. సాధారణములైన సరకుల వెలలు హెచ్చు గాకుండునట్లు తగిన యేర్పాటులను జేసి బీదలకు మహోపకార మొనరించిరి.

ఈయన కుమారుఁడు యుద్ధరంగమున గాయమునొందిన సైన్యముల తోడ శత్రువులకు జిక్కువడియున్నవాఁడు.

---

## 23. THE EMDEN'S PRANKS

## ఎమ్డన్ చేష్టలు

చీనా దేశమునఁ గ్రీస్తుమతమును వ్యాపింపఁజేయ నేగియుండు జెర్మని దేశపు పాదిరీలలో నిరువురను 1897-వ సంవత్సరమున బౌద్ధమతాభిమానులగు చీనాదేశస్థులు కొందఱు చంపిరి. ఇది యెఱింగిన జెర్మనిచక్రవర్తి చీనా చక్రవర్తియందు మనస్తాపముగలవాఁడై కయాచో సింగ్ టో అను రేవుపట్టణముల రెంటిని అక్రమముగాఁ దమ స్వాధీనము చేసికొనెను. మఱల ఆ మరుసంవత్సరముననే ఆ చక్రవర్తితో సమాధానముగ మాటలాడి కయాచో ప్రాంతమును దానితోఁ జేరిన కొన్ని చిన్న చిన్న దీవులను 99 యేండ్లకు వ్యాపారము చేసికొనుటకై మక్తాకు తీసికొని, పై పట్టణములు రెంటి యందును ఆ ద్వీపములందును బలమైన కోటల ననేకములను గట్టి, తమ దేశమువారిని గొందఱిని వానియందు కాఁపురముంచి విశేషముగా వ్యాపారము చేయ నేర్పాటు చేసెను. ఈ రెండు పట్టణములందును కొన్ని సేనల నుంచుటయేగాక, కొన్ని యుద్ధనావలు సైతము తమదేశపు వర్తకులకు సహాయముగా నుంపఁబడియుండినవి. ఇట్లు వ్యాపారముచేయువారికి సహాయముగా నుంపఁబడియుండు నోడలలోఁ గొన్ని యైరోపాయుద్ధమారంభమగుటకుఁ బూర్వమే సింగ్ టో నగరపు రేవులలో నుండినవి.

అట్లుండినవానిలో ఎమ్డ ననునది యొకటి. ఇది 3,544 టన్నుల తూనిక గల సామానులను గొనిపోవునంతటి శక్తి గలది. నేలబొగ్గుమాత్రము 850 టన్నులు పట్టును. దీనియందు పెద్దయంత్రపుఁ బిరంగులు రెండును, నాలుగంగులముల వెడల్పు నోరు గల పది సాధారణ పిఱంగులును, రెండతట్టామి గొట్టములును గలవు. దీని నిడివి 364 అడుగులు గలవు. వెడల్పును

441 అడుగులు; దీని యడుగు భాగమునకును నీటిమట్టమునకును 15¾ అడుగులు గలవు. ఇది 1909 సంవత్సరమున నీటఁ దేలుటకుగా మిక్కిలి తేలికగా జేయఁబడినది. కావున నిది యెంత కొద్దిపాటి లోఁతుగల చోటనైనను సులభముగాఁ బోవఁ గలదు. దీనికిఁ బొగగొట్టములు మూఁడు గలవు. ఇది పదునైదు వేల (15,000) గుఱ్ఱముల బలము గలది. దీనియందు 361 రు నౌకరులు గలరు. ఇది గంటకు 28¾ మైళ్లు పోఁగలదు. దీనికి వాన్ మ్యుల్లర్ అనువాఁడు ముఖ్యాధికారి. వీఁడు మహా ధైర్యవంతుఁడు.

ఈ చిన్న యుద్ధనావ జెర్మనిచక్రవర్తి తన దేశమున యుద్ధమున కారంభించిన 1914 సం॥ జూలై నెల 31 తేది నాటి రాత్రియే సింగపూరేవు నుండి తన చక్రవర్తికి భాగినేయుఁడైన జోసఫ్ రాజకుమారు నెక్కించుఁకొని బయలుదేరెను. అట్లు బయలుదేరివచ్చు మార్గమున ఆంగ్లేయులకును మన దేశమువారికిని ఆగస్టునెల 4 తేది (అనఁగా ఎమ్డెను సింగపూనగరమును విడచి బయలుదేరిన నాల్గవనాఁడే) యుద్ధమారంభ మయ్యెనని యెమ్డెన్ అధికారి తెలిసికొనియెను. కావున యెమ్డెను మార్గమునందు మధ్యస్థ దేశీయులగు డచ్చివారికి సంబంధించిన జావా ద్వీపమున కుత్తర పార్శ్వమున నున్న కొన్ని రేవులలోఁ గొన్ని దినములు దాఁగియుండి, సండా జలసంధి మార్గముగా సుమిత్రా ద్వీపములకుఁ దూరుపు భాగములం గొన్ని దినములు దాఁగియుండి, బంగాళాఖాతమున నాంగ్లేయుల యుద్ధనావలు లేవని యెఱింగి నికోబార్ ద్వీపములను గడచి అండమాను ద్వీపముల మూలముగా బంగాళాఖాతమునఁ బ్రవేశించెను. దీనికి సహాయముగా నాహార పదార్థముల నుంచికొనుటకై మార్కోమేనియా యను జెర్మని దేశపు బొగ్గులయోడ యొకటి దీనిని వెంబడించివచ్చెను.

ఇది బంగాళా సముద్రమునఁ బ్రవేశించియు, తన యోడయందలి కమ్ములులేని మెఱుపు తపాలాయంత్రముతో సముద్రతీరమునందుండు పెద్దపెద్ద రేవు పట్టణముల సంగతులను యుద్ధ సమాచారములను జక్కఁగా నెఱిఁగి, కడచిన 1914 సం॥ సెప్టెంబరునెల 10-వ తేది యుదయమున గ్రీసుదేశపు వ్యాపార నావయైన 'పోంటోపోరస్' అను నోడను బట్టుకొని, దాన జర్మనివారి లెక్కములను గట్టి దానికొక జెర్మని మాలిమిని నియమించి, ఆ యోడను సైతము తనకు సహాయముగా నుంచుకొనెను.

నాఁడు మొదలు 14-వ తేది వఱకు జగన్నాథమునకు సమీపమున ఆరునావలను బట్టి వానిలోఁ 'కబింగా' యనునోడను దక్కఁ దక్కినవానిని మున్నీట ముంచి, వానియందలి పనివాండ్రను కబింగా నావలోని కెక్కించెను: ఇది కబింగాను హూగ్లినది ముఖద్వారమునకు డెబ్బదియైదు మైళ్ల దూరమువఱకును దీసికొని వచ్చినది. ఎమ్డను నధికారి యందఱితోడను కరములఁ దెమల్చి, తా నీ సముద్రమునుండియుఁ దన్ను వెదకుచువచ్చు నాంగ్లేయ యుద్ధనావల బారినుండి తప్పించుకొనుటకు మార్గము లేమిని దెల్పి చింతించి యందఱితోడ నుపచార వాక్యములఁ బల్కి వీడ్కొని కబింగాను కలకత్తాకుఁ బోవ నియమించెను.

కబింగా పోయిన రెండుగంటల సేపటికి కలకత్తాకు వచ్చుచుండిన 'మెతీసన్' అనునోడను బట్టి పగులఁగొట్టి దాననుండిన పదుమువ్వు రుద్యోగస్థులను 57 గురు పనివాండ్రను మార్కొమేనియాలో నెక్కించుకొని ఎండన రంగూనునకు బయలుదేరెను.

18-వ తేది సాయంత్రము 7 గంటలకు రంగూను నది ముఖద్వారమునకు 25 మైళ్ల దూరమునఁబోవుచుండఁగా, ఎండను మధ్యస్థ రాష్ట్రమగు నార్వే-దేశపునోడ 'డోవర్' అనుదానిం జూచెను: ఆ యోడలోఁ దాను పట్టి-యుంచిన వారల నెక్కించి వారల రంగూనున విడువ వలసినదని చెప్పి తాను దానితోడఁ గొంతదూరము పోయి తటాలున నగుపడక పోయెను.

సెప్టంబరునెల 18 తేది రాత్రి రంగూనుకు సమీపమున నుండిన 'ఎమ్డను' మఱల బంగాళాఖాతమునఁ బ్రవేశించి యాంగ్లేయ యోడ పేరితో దనయొద్దనుండు మెఱుపు తపాలాయంత్రముద్వారా "ఎమ్డ నీ సముద్రమున లేదు. నావలు నిర్భయముగాఁ బయనము సేయవచ్చును" అని యచ్చటచ్చటనుండు కొన్ని యోడరేవులకుఁదానే సమాచారమునంపి, ఉన్నట్టుండి 22 తేది రాత్రి 9¼ గంటకుఁ జెన్నపురికి వచ్చి కొన్నిపిరంగిగుండ్లను బ్రయోగింప, వానిలోఁగొన్ని రేవునందలి కార్యస్థానములందును, మఱికొన్ని కిరొసీన్ నూనె తొట్లమీఁదను, ఇంకఁ గొన్ని సముద్రతీరముననుండు కొన్ని కట్టడముల మీఁదను, వేఱు కొన్ని చూళై వేపేరి మొదలగు కొన్ని ప్రదేశములందును బడినవి.



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA10UB107 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 89 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1 to 18 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Habeeba |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |